# ధర్మదీక్ష

[ బుద్ధ భగవానుని భవ్యచరితము ]

రచన:

తిరుమల రామచంద్ర

ప్రచురణ:

వడ్లమూడి రామయ్య అండ్ సన్స్

నెల్లూరు.

 1965 [వెల రూ. 3-25

# మనవి మాటలు

తథాగతుని భవ్యజీవితము, ఎవ్వరికైనను వరవడి కాదగినది. విద్యార్థుల లేలేతమనసులలో బుద్ధభగవానుని జీవితవిశేషములు అంకితమైనచో, వారి ఉత్తరజీవితము, సుఖమయము కాగలదను నమ్మకముతో, ఈ చిన్ని పొత్తమును అందజేయుచున్నాను.

ఈ పొత్తమును బౌద్ధులలో మహాయాన సంప్రదాయానుయాయులకు ప్రమాణమైన లలితవిస్తర మహాసూత్రము ననుసరించి రచించితిని. లలితవిస్తరము మన పురాణముల వలె అతిమానుష కథనములతో నుండును. దీనిని నేనును, మహాపండితులు శ్రీ ఖులుసు వెంకటరమణయ్యగారును పాలీసంస్కృత మూలమునుండి నాలుగేండ్లక్రిందట అనువదించి ఆంధ్రప్రభలో దారావాహికముగ ప్రచురించితిమి.

బుద్ధభగవానుని చరితముతో విద్యార్థులకు సేవచేయు అవకాశము నాకు శ్రీ వడ్లమూడి రామయ్యగారివలన లభించినది. వారికి కృతజ్ఞుడను.

2/583, పైక్రాఫ్ట్స్ రోడ్డు,
మదరాసు-5

భాషాసేవకుడు
తిరుమల రామచంద్ర.

## ౧

మన ప్రాచీన హిందూ ధర్మములను బోధించుటకును, భగవంతుని యవతారములను, మాహాత్మ్యములను వివరించుటకును పురాణములును, ఇతిహాసములును మిగుల నుపయోగించుచున్నవి. ఆ పురాణాదులను సాధారణముగా సూతుండు శౌనకాదులకు నైమిశారణ్యమున నెరిగించినట్లు ప్రసిద్ధి. ఆ విధముననే బౌద్ధమత ప్రవర్తకుడగు బుద్ధభగవానుని గూర్చిన మహాపురాణము బౌద్ధ శిష్యునిచే భిక్షులకు తుషితవనమున వినిపింపబడినది. పరమ పవిత్రమగు నా తథాగతుని చరిత్రము లలిత విస్తర మహాపురాణాను సారముగ బుద్ధ శిష్యుడు ప్రవచించిన విధమున నిందు పొందు పరుపబడు చున్నది.

ఒకానొకప్పుడు బుద్ధ భగవానుడు శ్రావస్తీ మహానగరమునందలి జేతవనములో, అనాథపిండదుని యారామమునందు ద్వాదశ సహస్ర సంఖ్యాకల భిక్షువులతో విహరించుచుండెను. ఆ సమయములో చిరంజీవులగు జ్ఞాన కౌండిన్యుడు, అశ్వజిత్తు, మహానాముడు, భద్రకుడు, యశోదేవుడు, రాహులుడు మున్నగువా రాతని వెంట నుండిరి. ప్రణిధాన పరిపూర్ణులు, క్షాంతిని వెదజల్లువారును అగు బోధిసత్త్వ లసంఖ్యాకులు నాతని యనుయాయులై యుండిరి.

ఆ సమయమునందు పరిషత్తులు, రాజులు, రాజకుమారులు, రాజమంత్రులు, రాజమహామాత్రులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, గృహపతులు, అమాత్యులు, పారిషదులు, పౌరులు, జానపదులు, ఇతరులగు తీర్థక శ్రమణక పరివ్రాజకులు మున్నగువారు చేయు సత్కారములను పొందుచు, భగవానుడు వారందరిచేతను పూజింపబడుచుండెను. అతడు ప్రభూతములైన ఖాద్యములను, భోజ్యములను, ఆస్వాద్యములను భుజించుచు, చీవర, పిండ పాత్రములను స్వీకరించుచు, శయనాసనములను గ్రహింపసాగెను, దౌర్బల్యమును పోగొట్టు నౌషధములను సేవించుచుండెను. ఇట్లుండియు నా మహనీయుడు నీటిపైనున్న పద్మమురీతి నన్నింటి యెడలను నిర్లిప్తుడై యుండెను. భగవానుడు శిష్యుల ననుగ్రహించు సంకల్పముననే వారు సమర్పించు వీనినన్నింటిని స్వీకరించుచుండెడివాడు.

ఆ మహనీయుని కీర్తి లోకమందెల్లెడల వ్యాపించెను. అతడు సమ్యక్సంబుద్ధుడై, విద్యాచరణ సంపన్నుడయి, సుగతుడై లోకము నెరిగిన పరుడై, పురుషులను ఋజుమార్గమునందు ప్రవర్తింపజేయు సారథియై దేవ మనుష్యులకు నియంతయయి యుండెను. బుద్ధ భగవానుడు శ్రమణ బ్రాహ్మణ, దేవ, మానుషులను స్వయముగా దెలిసికొని, యిహ పరలోకములను సాక్షాత్తుగా గమనించి విహరింపసాగెను. సద్ధర్మములను బోధించుచుండెను. ఆదిమధ్యాంతములందు కల్యాణరూపమును, యథార్థమును, ఉత్తమ పరి

కరములు కలిగియు, పరిపూర్ణమును, పరిశుద్ధమును, స్వచ్ఛమును అగు బ్రహ్మచర్యమును వెలడించుచుండెను.

అయ్యెడ భగవానుడు రాత్రిసమయమున మధ్యమ యామమునందు బుద్ధాలంకార వ్యూహమను సమాధిని నిష్ఠతో అవలంబించెను. సమాధి నిష్ఠితుడైన వెంటనే భగవానునిమీదుగా శిరస్సంధియందు ఉష్ణీష వివరాంతరమునుండి పూర్వబుద్ధానుస్మృత్యసంగాజ్ఞానా లోకాలంకారమను రశ్మి సంచరించెను. ఆ రశ్మి శుద్ధావాసములను దేవభవనములను ప్రకాశింపజేసి, మహేశ్వర దేవపుత్రులను ప్రోత్సాహపరచెను.

ఆరాత్రి కడవగా, ఈశ్వరుడను పేరుకల శుద్ధావాసకాయికుడగు దేవపుత్రుడును, మహేశ్వరుడు, నందుడు, సునందుడు, చందనుడు, మహితుడు, ప్రశాంతవినీతుడు మున్నగు నితర శుద్ధావాసకాయికులగు దేవపుత్రులును, వచ్చి భగవానుని పాదములకు నమస్కరించి యేకాంతముగా నాతనితో నిటు పలికిరి:

"హే భగవన్! పురాణశ్రేష్ఠమగు లలితవిస్తరమను ధర్మపర్యాయము కలదు. అది పెక్కు విషయములతో నొప్పుచున్నది. అది ప్రాచీనులగు తథాగతులచే భాషితపూర్వమే కాని క్రొత్తది కాదు. ఎట్లన-భగవానులగు ధర్మోత్తరుడు, ధర్మకేతువు, దీపంకరుడు, గుణకేతువు, మహాకరుడు, ఋషిదేవుడు, శ్రీతేజుడు, సత్యకేతువు మున్నగువారు దాని నభి

భాషించియున్నారు. ఆ మహాగ్రంథము నిపుడు భగవాను డును ప్రకాశింపజేయవలెను" అని.

పిదప బహుజన హితముకొరకును, బహుజనసుఖము కొరకును, జననికాయము ప్రయోజనమునకును, దేవ మనుష్యుల సుఖముకొరకును, సర్వమారుల నవమానిం చుటకొరకును, సద్ధర్మమును పరిగ్రహించుటకొరకును, బుద్ధ కార్య పరిసందర్శనార్థమును భగవానుడు దయామయుడై లోకహితార్థము చిత్తైకాగ్రతను వహించెను.

అంత దేవపుత్రులు తుష్టులు, స్థిరమనస్కులు, ప్రమోదమాన మానసులునయి భగవానుని పాదములపై శిరస్సులనుంచి నమస్కరించి, అతనికి ముమ్మారు ప్రదక్షిణ మొనరించి, దివ్యములగు నగురుచందనములచే పూజలొ నర్చి యచటనే అంతర్ధాన మొందిరి.

భగవానుని చిత్తైకాగ్రతను పరికించి సర్వదేవతలును సంతోషించిరి. ఉద్రిక్తులై యానందముతో పుష్పవర్షమును కురిపించిరి.

౨

లోకమున ధర్మమునకు గ్లాని కలిగి, అధర్మము విజృంభించి ప్రజలు పెక్కువిధముల దుఃఖముల ననుభవించుచుండు సమయములో భగవంతుడు మానవరూపమున భూలోకమునం దవతరించి జగము నుద్ధరించుచుండును. హింసాసత్యనిర్దయా ద్యధర్మములు విజృంభించి, జనులు జరామరణ వ్యాధ్యాది దుఃఖములకు భాజనములై యున్న కాలమున భగవానుడగు బోధిసత్త్వుడు తథాగతరూపమున శుద్ధోదన మహారాజునకు సుపుత్రుడై జనించెను.

శుద్ధోదన మహారాజు భారతదేశమునం దార్యావర్తమున కపిలవస్తు మహానగరము రాజధానిగా రాజ్యము నేలుచుండెను. ఆయన పట్టమహిషి మాయాదేవి. ఆపుణ్యదంపతుల పూర్వజన్మ పుణ్యఫలముగనే తథాగతుడు సిద్ధార్థుడుగా నుద్భవించెను.

బోధిసత్త్వుడు భూలోకమున నుద్భవించుటకు మున్ను ధర్మకాల సంచోదితుడై మహావిమానమునుండి నిష్క్రమించి ధర్మోచ్ఛ్రయ మను పేరుగల మహాప్రాసాదమున కూరుచుండి తుషిత దేవగణములకు ధర్మము నుపదేశించుచుండెను. ఆ సమయములో శుద్ధావాసకాయికులగు దేవపుత్రులు జంబూద్వీపమునకు వచ్చి భగవానుని యవతారమునకై నిరీక్షించుచుండిరి. వారిలో కొందరు బ్రాహ్మణ

వేషములను ధరించి, బ్రాహ్మణులకు వేదాధ్యాపన మొనర్చుచుండిరి. ఇట్లొనరించినయెడల జన్మింపబోవు బోధిసత్త్వుడు ముప్పదిరెండు మహాపురుష లక్షణములతో కూడియుండుననియు, అట్టి మహాపురుషునకు రెండే పద్ధతు లుండుననియు వారి యభిప్రాయము. అతడు గృహమునందు నివసించుచుండు నెడల చతురంగ బల సమన్వితుడును, విజయియు, ధార్మికుడును చక్రవర్తియు నగును. సప్తరత్నములతో కూడియుండును. చక్రరత్నము, హస్తిరత్నము, అశ్వరత్నము, స్త్రీరత్నము, మణిరత్నము, గృహపతి రత్నము, పరిణాయకరత్నము-అనునవే యా సప్తరత్నములు!

మూర్ధాభిషిక్తుడగు క్షత్రియునకు చక్రరత్నము లభించును. అతడు పౌర్ణమినాడు శిరఃస్నానమొనరించి, యుపవాస నియమమున నున్నచో దివ్యమగు చక్రరత్నము తూర్పుదిక్కునందు ప్రాదుర్భవించి యతనికి లభించును. అది సహస్రారములతోను, నాభితోను, నేమితోను కూడి సువర్ణ వర్ణమై యుండును. అంత మూర్ధాభిషిక్తుడగు నారాజు ఒక యంసమును నుత్తరాసంగముగా చేసికొని దక్షిణజానువును భూమిపై మోపి, కుడిహస్తము నెత్తి "ఓ దివ్యమగు చక్ర రత్నమా! ధర్మముగా ప్రవర్తింపుము. అధర్మముగా ప్రవర్తింపకుము" అని ప్రార్థించును. మూర్ధాభిషిక్తుడగు నా క్షత్రియునిచే నడుపబడిన యా చక్రరత్నము సరియగు పద్ధతినే తూర్పుగా పోవును. అపుడు తూర్పుదిక్కున నుండు రాజులును, మాండలికులును సువర్ణ చూర్ణపరిపూర్ణములగు రజతపాత్రములతో, రజత చూర్ణపరిపూర్ణలగు సువర్ణ

పాత్రములతోను ఎదురుగా వచ్చి స్వాగత మొసంగుదురు. “ఓ దేవా! రమ్ము. నీ కిదిగో స్వాగతము! వచ్చి, సమృద్ధ మును, స్ఫీతమును, క్షేమమును, సుమిత్రమును, రమణీయ మును, బహుళజనా కీర్ణమునగు రాజ్యమును పాలింపుము. విజయవంతమగు నీ రాజ్యమును స్వీకరింపుము” అని ప్రార్థింతురు. అంత సార్వభౌము డా రాజులను, మాండలికులను జూచి “మీరందరును మీ మీ రాజ్యములను ధర్మముగా పాలించుచుండుడు. అధర్మమునకు తావీయకుడు. ప్రాణిహింస చేయకుడు. అనుచితములగు నభీష్టములందు మనస్సును ప్రవేశింపనీయవద్దు. అసత్యమును పలుకకుడు.” అని ప్రబోధించును; తూర్పుదిక్కును జయించును. మున స్నానమొనరించి, గగనమార్గమున దక్షిణదిక్కునకు పోయి, దానిని జయించును. పిదప నారీతినే పశ్చిమదిశను, ఉత్తరదిక్కును కూడ జయించి, యుత్తర సముద్రజలమున స్నాతుడై గగనమార్గమున రాజధానికి వచ్చును.

ఇట్లే మూర్ధాభిషిక్తుడగు రాజునకు హస్తిరత్నము లభించును. అయ్యది సర్వశ్వేతమై సప్తాంగసుప్రతిష్ఠితమై యుండును. అతడు సూర్యోదయకాలమున నా హస్తిరత్నముపై నెక్కి, సముద్రమేఖలయగు నీపృథివి నంతటిని పర్యటించి రాజధానికి వచ్చును.

ఈరీతినే చక్రవర్తి హయరత్నమును కూడ సంపాదించును. అయ్యది సర్వనీలమై నల్లని శిరస్సుకలదై, ముంజకేశమై, ప్రసన్నవదనమై, స్వర్ణధ్వజము కలిగి, సర్వా

లంకారభూషితమై, వాలాహకనామము కల్గియుండును. ఆ యశ్వము గగనమార్గమున సంచరింపగలదు. మూర్ధాభిషిక్తుడగు రాజు ప్రాతఃకాలమున నా హయరత్నము నధిరోహించి, సముద్రపర్యంతము వ్యాపించియున్న భూమండలము తిరిగి రాజధానికి వచ్చి ప్రజాపాలన మొనరించును.

హయరత్నము లభించినట్లే మూర్ధాభిషిక్తుడగు క్షత్రియునకు మణిరత్నము కూడ లభించును. దివ్యమగు నా మణిరత్నము తేజమున అంతఃపురమంతయు వెలిగిపోవును. అంధకారబంధురమగు అర్ధరాత్రిసమయమున ఆ మణిరత్నమును ధ్వజాగ్రమున నుంచి రాజుద్యానవనమునకు పోవును. దాని తేజమున సమస్తప్రదేశములు యోజనపర్యంతము స్ఫుటముగా కానవచ్చును. దాని పరిసరములందుగల మానవులు సూర్యోదయమైనదను భ్రాంతితో ప్రాతఃకాల కృత్యములకు కడంగుదురు.

మూర్ధాభిషిక్తునకు గృహపతిరత్నము కూడ నిట్లే లభించును. ఆ గృహపతి మేధావియగు విద్వాంసుడు. దివ్యచక్షుస్సు కలవాడు. ఆ దివ్యచక్షుస్సుమూలమున నాతడు నిధులను చూడగల్గును. అస్వామికములగు నిధులే యాదివ్యదృష్టికి గోచరింపగలవు. ఆ నిధులు చక్రవర్తికే చెంది యపారమగు ధనమును చేకూర్చును.

ఇట్లే మూర్ధాభిషిక్తుడగు క్షత్రియునకు పరిణాయకరత్నము లభించును. ఆ పరిణాయకుడు పండితుడును, గొప్ప

మేధావియునయి ప్రభువు తలచుకొన్నంతమాత్రమున సమస్తసైన్యమును సమకూర్చును.

ఇట్టి సప్తరత్నములను సంపాదించిన మూర్ధాభిషిక్తునకు శూరులు, వీరులు, సుందరులు, పరసైన్యమర్దకులు నగు పుత్రులు జనింతురు.

ఒకవేళ నీతడు గృహమున నుండక అభినిష్క్రమణ మొనరించినయెడల వీతరాగుడై సన్న్యసించి దేవతలకును, మనుష్యులకును నాయకుడై ధర్మశాసకుడై యలరారును.

బోధిసత్త్వుడు మాతృగర్భమున ప్రవేశించినసమయమునందు మహానగరమగు రాజగృహమున గోలాంగూల పరివర్తనపర్వతముపయి మాతంగుడను ప్రత్యేకబుద్ధుడు విహరించుచుండెను. వారాణసియందు ఋషిపతనమున మృగదావమున నయిదుగురు ప్రత్యేకబుద్ధులు నివసించుచుండిరి. వారు బోధిసత్త్వుని మాతృగర్భప్రవేశమును గుర్తించి మిక్కిలి యానందించిరి.

బోధిసత్త్వుడు మాతృగర్భమునందు ప్రవేశించుటకు ముందు, ఆతడేనగరమున, ఏ కులమున నుద్భవించుట యుచితమో యనువిషయమున దేవపుత్రులకు వాదవివాదములు జరిగినవి. మగధదేశమునందలి వైదేహీకులము సుభిక్షమై, సమృద్ధమై, క్షేమంకరమై యున్నదనియు, అచటనే బోధిసత్త్వు డుదయించుట యుచితమనియు కొందరు భావించిరి. కాని, యా కులము చంచలమనస్సు కలదనియు, మాతృశుద్ధిగాని, పితృశుద్ధిగాని లేనిదనియు, పుణ్యభాజనము

కాదనియు, సత్కులము కాదనియు, రాజధానియందు తటాకములు, సరస్సులు, ఉద్యానములు లేవనియు, అయ్యది బోధిసత్త్వుని జన్మమున కనర్హమనియు కొందరు పలికిరి.

కౌశలకులము ధనవంతమనియు, గొప్పవాహనములు, గొప్పపరివారము కలదనియు, అందు బోధిసత్త్వుడు ప్రభవించుట ఉచితమనియు మఱికొంద రభిప్రాయపడిరి. అందును మాతృ పితృ శుద్ధి లోపించినదనియు, రత్నములు నిధులు లేవనియు, నయ్యదియు ననర్హమనియు కొందరు విమర్శించిరి.

వత్స రాజకులము తగినదని కొందరి యాశయము. అయ్యది శుద్ధము, స్ఫీతము, క్షేమంకరము, సుభిక్షమునని వా రనిరి. కాని, యాకులము ప్రాకృతమనియు, తీక్ష్ణత కలదనియు, అం దుజ్జ్వలమగు తేజస్సు మృగ్యమనియు, పరపురుష జన్మావృతమైనదనియు, అచటిరాజు ఉచ్ఛేదవాది యనియు నికకొందరు పలికిరి.

వైశాలీపురము సమృద్ధమై, స్ఫీతమై, సుభిక్షమై, రమణీయమై, క్షేమంకరమై యున్నదనియు, అది జనసమృద్ధి కలిగి గొప్ప ప్రాసాదములతో విరాజిల్లుచున్నదనియు, అచట పూలతోటలు పెక్కున్నవనియు, అయ్యది అమరావతికి సమానమనియు బోధిసత్త్వుని మాతృగర్భ ప్రవేశమున కది తగినదనియు కొందరు పలికిరి. కాని, ఆ నగరమున న్యాయము శూన్యమనియు, ధర్మాచరణము లేదనియు, ఉత్తమ మధ్యమ భేదముకాని, జ్యేష్ఠ వృద్ధ కనిష్ఠాది భేద

ముకాని లేదనియు, అచటివారిలో నొక్కొక్కరును తానే రాజని భావింతురనియు, గురు శిష్యభావము కానరాదనియు, అందువలన నది యనర్హమనియు మరికొందరు చెప్పిరి.

ప్రద్యోతకులము గొప్ప బలముకలదనియు, గొప్ప వాహనములు కలదనియు, యుద్ధములందు విజయమును పొందునదనియు, బోధిసత్త్వుని జన్మమున కదియే తగిన దనియు కొందరి యాశయము. ప్రద్యోత వంశీయులు చండులు, చపలులు, క్రోధనులు, పరుషవచనులు, సాహసికులు, కర్మాచరణమున నాసక్తి లేనివారు కావున నారి వంశ మనర్హమని కొందురు బదులు చెప్పిరి.

"మధురానగరి సమృద్ధమైనది. స్ఫీతమైనది. క్షేమంకరమైనది. సుభిక్షమైనది. మిక్కిలి జనసమ్మర్దము కలది. శూరసేనేశ్వరుడగు నా పట్టణపు రాజు కంసుని వంశమున జన్మించిన సుబాహువు. అదియే బోధిసత్త్వుడవతరించుట కనుకూలమైన స్థల" మని కొందరి యభిప్రాయము. అయినను, అదియు నర్హమైన స్థలము కాదని కొందరు నిశ్చయించిరి. ఏలయన - రాజు దుష్టుడగు కంసుని వంశమున జన్మించినవాడు. అతడు దస్యులకు రాజు. అట్టి వానియింట బోధిసత్త్వుడవతరించు టెంతమాత్రము తగదు.

"మహానగరమగు హస్తినాపురమును పాలించు రాజు పార్థివకుల సంప్రసూతుడు. అతడు రూపసంపన్నుడే కాక శూరుడును, వీర్యవంతుడునయి, పరసైన్యములను మర్దింపగల దక్షత కలిగియున్నాడు. అక్కతన నతని వంశము

బోధిసత్త్వుని జన్మమునకు తగియున్నది'' అని కొందరు తలం చిరి. కాని దానికిని కొందరు సమ్మతింపలేదు. ఏలయన - పాండవుల వంశమున సాంకర్యము కానవచ్చు చున్నది. యుధిష్ఠిరుడు ధర్మునకును, భీమసేనుడు వాయుదేవునకును గలిగిరనియు, అర్జును డింద్రుని కుమారుడనియు, నకులసహ దేవు లశ్వినుల పుత్రులనియు చెప్పుదురు.

పిదప కొందరిట్లు పలికిరి-''మిథిలాపట్టణ మతిరమణీయ మైనది. అది మైథిలరాజగు సుమిత్రుని నివాసభూమి. ఆరాజు వద్ద గొప్ప చతురంగబల మున్నది. బంగారము, మాణిక్య ములు, మౌక్తికములు సమృద్ధిగా కలవు. అపారమగు ధనసంపద యాతనికి కలదు. సమస్త సామంతరాజులు నాతని శిరసావహించుచుందురు. ఆరాజు బలపరాక్రమ సమన్వితుడే కాక ధర్మవత్సలుడునై యున్నాడు. అతనివంశము బోధి సత్త్వ డవతరించుటకు తగియున్నది.''

సుమిత్రు డుత్తమగుణగణ సమన్వితుడగుట వాస్త వమే: కాని యతడు మిక్కిలి వృద్ధుడు. అతనికి సంతానము కలుగుట కవకాశము లేనందున నతనివంశముకూడ ననర్హ మే యని చెప్పవలెను.

ఈరీతిగా దేవపుత్రులందరును విమర్శించి, బోధిసత్త్వ డవతరించుటకు తగిన వంశమును, స్థలమును వెదుకసాగిరి. వారు జంబూద్వీపమునందలి పదునారు దేశములను వెదకి వెదకి విసిగివేసారిరి. ఎచ్చటను వారికి తగిన వంశముగాని, స్థానముగాని గోచరముకాలేదు. దేవపుత్రులందరును మిగుల కలతపడసాగిరి.

ఆ సమయములో జ్ఞానకేతుధ్వజుడను దేవపుత్రుడు మిగిలిన పారిషదులం జూచి "పారిషదులారా! ఈ చర్చలు చాలును. బోధిసత్త్వుడుదయించుటకు తగిన స్థలము, తగిన వంశము మనకు తెలియరాలేదు. మనమందరము బోధిసత్త్వుని వద్దకే పోయి ఆయననే యడుగుదము." అని పలుకగా, వారందరును సమ్మతించిరి. పిదప దేవపుత్రు లందరును బోధి సత్త్వుని సందర్శించి కృతాంజలిపుటులై "ఎట్టి గుణములతో కూడిన కులరత్నమున చరమభవికుడగు బోధిసత్త్వుడవత రించునో తెలుపవలె"నని ప్రార్థించిరి. "చతుఃషష్టి గుణ ములతో కూడిన కులముననే అనతరించును. ముప్పదిరెండు గుణములు గల స్త్రీ గర్భమునందే ఉద్భవించును" అని పలికి బోధిసత్త్వుడా గుణములనెల్ల వివరించెను. అంతేకాక బోధిసత్త్వుడు కృష్ణపక్షమునందు గాక, శుక్లపక్షమునందలి పౌర్ణమినాడే, పుణ్యానక్షత్రయోగమున మాతృగర్భ ప్రవిష్టు డగుననియు దెల్పెను.

పిదప దేవపుత్రు లందరును బోధిసత్త్వుడు వివరించిన గుణగణములుకల కులమునకయి గవేషణమొనర్చుచు, తుదకు శాక్యవంశమే యట్టిదని గ్రహించిరి. ఆ వంశము రాజు శుద్ధోదనుడు మాతృపితృ శుద్ధికలవాడు. పత్నీ పరి శుద్ధుడు. పుణ్యతేజస్సుతో ప్రకాశించువాడు. ఉత్తమ వంశజుడు. చక్రవర్తుల వంశమున నుద్భవించినవాడు. అపరి మిత ధనము, రత్నములు, నిధులు కలవాడు. కర్మలయెడ నాసక్తికలవాడు. పాపదృష్టి లేనివాడు. సర్వశాక్య విషయము నకును ఎదురులేని ప్రభువు. తన కొలువులోని శ్రేష్ఠులు,

గృహపతులు, మంత్రులు, పారిషదులు మున్నగువారి యెడల నెక్కువ యనుగ్రహము కలవాడు, సర్వజనుల పూజల నందుకొనువాడు. దర్శనీయుడు. మిక్కిలి వృద్ధుడును, యువకుడును గాక నడిమివయస్సులో ఉన్నవాడు. సర్వ గుణోపేతుడు. శిల్పమును, కాలమును, ఆత్మను, సర్వ ధర్మములను, తత్త్వమును గుర్తెరిగినవాడు. లోకజ్ఞుడు. లక్షణజ్ఞుడు. ప్రజలకు కుశముల గూర్చుచు న్యాయముగ పాలించువాడు. అతని నివాసము కపిలవస్తు మహానగరము. శుద్ధోదనుని పట్టమహిషియగు మాయాదేవి శాక్యాధిపతి యగు సుప్రబుద్ధుని పుత్రిక. నవతరుణి. రూపయౌవన సంపన్న. చిత్రమునందలి యందమైన ప్రతిమంబోలె దర్శ నీయురాలు. దేవకన్యవలె సర్వాలంకార భూషిత. సత్య వాదిని. కోకిల స్వరముకలది. కర్కశముగను, పరుషము గను సంభాషించి యెరుగదు. మధురప్రియవాదిని. క్రోధ మద మాన దర్పములు లేనిది. శీలవతి. త్యాగసంపన్న. స్మితముఖి. లాక్షారసముతో సమానవర్ణముకల పాణిపాద ములు కలది. లోకోత్తర స్త్రీరత్నములకు ప్రతినిధి. మహా రాజాంతఃపుర మధ్యగతయగు నామెయే బోధిసత్త్వునికి జననిగా ఉండదగినది.

బోధిసత్త్వుడు తెలిపిన గుణగణము లన్నియు నుండుట వలన శాక్యవంశమే బోధిసత్త్వున కర్హమైనదనియు, మాయా దేవియే అతనికి జననిగా నుండదగినదనియు దేవపుత్రులు నిర్ణయించిరి.

# 3

శిశిరకాలము గడచెను. వసంతర్తువు వచ్చెను. వృక్షములు చిగిరించి, పత్రపుష్పవిలసితములయి కన్నులకు విందుగొలుపుచుండెను. శీతోష్ణములు సమముగా నుండి, దుమ్ము రేగక నేల చక్కగా నుండెను. అట్టిసమయమున వైశాఖమాసమున విశాఖానక్షత్రయుక్తసమయములో శుక్లపక్షమున పదునైదవతిథియగు పౌర్ణమాసియందు బోధిసత్త్వుడు తుషితభవనమునుండి బయలువెడలి, ఆరు దంతములు, ఇంద్రగోపకశిరస్సు, గల శ్వేతగజరూపమున మాయాదేవీగర్భమునందలి దక్షిణభాగమున ప్రవేశించెను. ఆమె సుఖముగా నిద్రించి, స్వప్నములో నిట్టి శ్వేతగజము తన కుక్షిలో ప్రవేశించుటను గాంచెను.

ఇట్లు స్వప్నమును గాంచిన మాయాదేవి వెంటనే మేల్కాంచి, శయనమునుండి లేచి, మిక్కిలి యానందించుచు, చెలికత్తెలం బిలిచి, వారితోగూడ ప్రాసాదమునుండి దిగి అశోకవనమునకు వచ్చెను. అచట నొక వేదికపై సుఖోపవిష్టురాలయి, మహారాజగు శుద్ధోదనుని దర్శనము నపేక్షించుచున్నట్లు దూతమూలమున వార్తను పంపెను.

శుద్ధోదనమహారాజు దూతవలన వృత్తాంతమునంతటిని తెలిసికొని ప్రహృష్టమనస్కుడై భద్రాసనమునుండి లేచి మంత్రిపురోహితులతోను, పారిషదులతోను, బంధు

జనులతోనుకూడ అశోకవనమునకు వచ్చెను. అతడు మహారాణివలన నామె స్వప్నవృత్తాంతమును విని, ఆ స్వప్నఫలమును తెలుపవలెనని బ్రాహ్మణులను ప్రార్థించెను. రాజకుమారుడు శుభలక్షణములతో నుద్భవింపగలడనియు, అతడు రాజ్యమును పాలించినచో చక్రవర్తియగుననియు, లేనియెడల గృహమును పరిత్యజించి, సర్వప్రాణులయెడలను అనుకంపను చూపుచు, ధర్మోపదేశ మొనర్చుచు ముల్లోకముల నుద్ధరించుననియు తెల్పిరి.

విప్రుల మాటలను వినిన పిదప శుద్ధోదనుడు సంతృప్తిచెంది వారిని ఖాదనీయ భోజనీయాస్వాదనీయములచే తృప్తిపరచి, ఆచ్ఛాదనముల నిచ్చి సగౌరవముగ పంపివేసెను. మరియు కపిలవస్తుమహానగరమునకు గల నాలుగు ద్వారములందును, చతుష్పథములందును జనులందరికిని పెక్కుదానము లీయబడెను. అన్నమడిగినవారికి అన్నము, పానీయము నభిలషించినవారికి పానీయము, వస్త్రములను కోరినవారికి వస్త్రములు నీయబడెను. అట్లే యానార్థులకు యానములు, గంధమాల్యవిలేపనాదులును వారి వారి కీయబడినవి.

మాయాదేవి సుఖముగా విహరించుట కెట్టి గృహము తగియుండును?—అని శుద్ధోదను డాలోచింపసాగెను. అట్టి సమయమున నలుగురు మహారాజులు శుద్ధోదనునివద్దకు వచ్చి, గృహముంగూర్చి ఆలోచింపనక్కర లేదనియు, తాము తగిన భవనమును చూడగలమనియు తెలిపిరి.

దేవతలకు ప్రభువైన యింద్రుడు వచ్చి తన వైజ యంతభవనమునకు దీటైన భవనము నిత్తునని వాగ్దాన మొనర్చెను. ఇట్లే సుయాముడను దేవపుత్రుడును, సంతుషి తుడను దేవపుత్రుడును, సుధర్మితుడను దేవపుత్రుడును, పర నిర్మిత వశవర్తియను దేవపుత్రుడును బోధిసత్త్వుని మాతృ దేవి నివసించుటకు తమ తమ భవనముల నిత్తుమని చెప్పిరి. కామావచరులైన దేవేశ్వరులును కపిలవస్తు మహానగరములోని తమ తమ భవనముల నిత్తుమని చెప్పిరి. శుద్ధోదనుడు మాత్రము మానవాతి క్రాంతము, దివ్యులకు పొందరానిదియు నగుభవనమునే నిర్ణయించెను. అందు మాయాదేవి సుఖముగా విహరింపసాగెను.

బోధిసత్త్వుడు మాయాదేవీ గర్భమున దక్షిణభాగ మున ప్రవేశించుటవలన నా భాగమే యామెకు కొంత బరువుగా తోచెను. మిగిలిన భాగము తేలికగా నుండెను. ఆమెకు కొంత బరువుగా తోచినను, ఎట్టి ఆయాసము, శ్రమ కలుగలేదు. గర్భధారణవలన కలుగు దుఃఖముల నామె యనుభవింపలేదు. రాగద్వేషమోహాదు లామె నావరింప లేదు. శీతోష్ణములుగాని. ఆకలిదప్పులుగాని యామెకు కలుగలేదు. ఒకరి కపకారము చేయవలెనను బుద్ధికాని, హింసింపవలెనను బుద్ధికాని యామెకు కలుగలేదు. ఆమె చెడుకలలు కాంచలేదు. స్త్రీమాయ యామె నావరింప

లేదు. తరచుగా స్త్రీలకు కలుగు క్లేశము లామెను బాధింప లేదు. కపిల వస్తు మహానగరమునందుగాని, శుద్ధోదనుడు పాలించు దేశమునగాని, ఎవరైనను భూతావిష్టులై బాధ పడుచున్నయెడల మాయాదేవీ దర్శన మాత్రముననే యా బాధ నివృత్తమగును. వివిధరోగములచే పీడితులగుచున్న వారును, వాత పిత్త శ్లేష్మ సన్నిపాత రోగముచే బాధపడు వారును, చక్షుః శ్రోత్ర ఘ్రాణ జిహ్వారోగములచేతను, శీర్షరోగముచేతను పీడింపబడువారును, దంతరోగ పీడితు లును, కంఠరోగ పీడితులును, గలగండ రోగపీడితులును, కుష కాస శోషాది రోగపీడితులును, బోధసత్త్వుని మాతృ దేవి దక్షిణహస్తమును తలపైనుంచినంతమాత్రమున రోగ విముక్తులై సంతోషముతో తమతమ గృహములకు పోవు చుందురు.

మాయాదేవి తన దక్షిణ పార్శ్వమును చూచుకొని నపుడు ఆమె కుక్షియందున్న బోధిసత్త్వుడు ముకురమునందు ప్రతిబింబించు ముఖమువలెనే స్పష్టముగా గోచరించు చుండును. అతడు మాతృగర్భమునందున్న సమయములో రాత్రిందివములు దివ్యములగు తూర్యధ్వనులు వినవచ్చు చునే యుండును. దివ్యములగు పుష్పవర్షములు కురియుచునే యుండును. దేవతలు యుక్తకాలమున వర్షములను కురియింప సాగిరి. ఋతువులును, నక్షత్రములును పరిభ్రమించుచుండి

నవి. రాజ్యము సుభిక్షముగా నుండెను. ప్రజలు కష్టములు లేక సుఖపడుచుండిరి. ఎవ్వరికిని కూడు గుడ్డలకు లోపము లేకుండెను. శుద్ధోదనమహారాజు బ్రహ్మచర్య వ్రత మవలంబించి, రాజ్యకార్యములను మంత్రులకే అప్పగించి, తాను తపోవనముననున్న రీతిగనే సుపరిశుద్ధహృదయుడై ధర్మమునే అనుసరించుచుండెను.

౪

మాయా దేవికి పదిమాసములు నిండెను. కుమారుని జన్మసమయము ప్రాప్తించెను. ఆ సమయములో శుద్ధోదన మహారాజు గృహోద్యానమున పెక్కు సునిమిత్తము కాన వచ్చెను. అయ్యెడ మాయా దేవి కుమారుని జన్మసమయ మును గుర్తించెను. ఆమెకు మనస్సున నొక కోరిక కలిగెను. ఆమె శుద్ధోదన మహారాజును గాంచి యిట్లనెను:—

"దేవా! నా మనస్సున నిప్పుడు చిన్నకోరిక యొకటి కలిగినది. ఉద్యానవనమున విహరింపవలెనను సంకల్పము కలిగినది. మీరు కోపింపక యనుమతించితిరేని నా యభి లాషను తీర్చుకొందును. ఇపుడు వసంతర్తువు వైభవముతో వెలయుచున్నది. వికసిత పుష్పములపై భ్రమించు భ్రమర మధురరుతములు, కోకిలముల మధురగానములు, పుష్ప పరాగముతో కూడిన సురభిమలయమారుతము నా మనస్సు నాకర్షించుచున్నది. ప్రభువులు నా కోరికను మన్నింతురని విశ్వసించుచున్నాను."

దేవి పలుకులకు శుద్ధోదనుడును సంతసిల్లెను. వెంటనే తన రాజ్యముననున్న లుంబినీవనమును మహారాణి కాకర్ష

ణీయముగా నుండునట్లు చక్కగా అలంకరించుటకు సేవకుల కాజ్ఞయిచ్చెను.

వనవిహారమునకు తగిన యేర్పాట్లన్నియును జరిగిన పిదప మాయాదేవి దాసదాసీజన పరివృతయై లుంబినీ వనమునకు బయలుదేరెను. ఆ సమయమున మనోహరము లగు తూర్యధ్వనులు మ్రోగెను. ఆమె యొక దివ్యస్యంద నము నారోహించి ప్రయాణమొనర్చెను.

లుంబినీవనమును చేరగనే మాయాదేవి రథము నుండి దిగి చెలికత్తెలతోకూడ వనవిహారమునకు బయలు దేరెను. ఆమె యా వనమునందలి యొక్కొక్క వృక్షమును పరిశీలించి చూచుచు నొక ప్లక్షవృక్షమును చూచెను. ఆ రావిచెట్టు చక్కని కొమ్మలతోడను, అందమైన ఆకుల తోను, పరిమళించు పుష్పములతోను కూడి మిక్కిలి ప్రకాశించుచుండెను. ఆ వృక్షమూలమున నీలవర్ణము కలిగి, అందముగా పచ్చిక పెరిగియుండెను.

మాయాదేవి యా వృక్షము చేరువకు పోగా, అది యామె గర్భమునందున్న బోధిసత్త్వుని తేజోనుభావమున వంగి, నమస్కరించెను. మాయాదేవియు తన కుడిచేతినెత్తి యా వృక్షశాఖ నొకదానిని సవిలాసముగా పట్టుకొని దానిని గౌరవించెను. ఆమె కంతకుమున్నే పదిమాసములు నిండి నందున, మరికొంత సేపటికే కుమారుని ప్రసవించెను.

బోధిసత్త్వుడు మాతృగర్భమునుండి జన్మించిన వెంటనే దేవతల ప్రభువగు నింద్రుడును, బ్రహ్మయు నతని యెదుటికి వచ్చి గౌరవించిరి. నందోపనందులనెడి నాగరాజులు గగన తలముననే నిలిచి శీతోష్ణవారిధారలను రెంటిని వర్షించి బోధిసత్త్వునకు స్నానము చేయించిరి. శక్రుడు, బ్రహ్మ, లోకపాలురును గంధోదకమును చల్లి, పూలవర్షమును కురిపించిరి.

మాతృగర్భమునుండి యుద్భవించిన బోధిసత్త్వుడు భయరహితుడై సింహమువలె భీకరుడై యుండెను. అతడు పుట్టిన వెంటనే తూర్పుదిక్కువైపు ఏడడుగులు వేసి నడచెను. అది "కుశలమూలములగు ధర్మముల కన్నింటికిని నేను పూర్వగామిని" అను నర్థమును సూచించుచుండెను. అతడు నేలపై నడచుచున్నప్పుడు మీదుగా నంతరిక్షముపై దివ్యములగు ఛత్రచామరములు ఆతనినే యనుసరించుచు కొన వచ్చినవి. బోధిసత్త్వు డడుగుపెట్టినచోటనెల్ల పద్మముల గుర్తు లేర్పడుచుండెను.

పిదప బోధిసత్త్వుడు దక్షిణాభిముఖుడై ఏడడుగులు వేసెను. ఆ నడక, తాను దేవమనుష్యులకు దక్షిణీయుడనను నభిప్రాయమును వ్యక్తపరచెను. తరువాత నతడు పశ్చిమ దిగభిముఖుడై ఏడడుగులు వేసెను. ఏడవయడుగులో సింహమువలె నిలిచి "నేనే లోకములో జ్యేష్ఠుడను. నేనే

శ్రేష్ఠుడను. మనుష్యజాతి చాల హీనస్థితిలో నున్నది. జరామరణ దుఃఖములనుండి నేనే జాతి నుద్ధరింతు''నను నాశయమును సూచించెను. ఆ వెనుక ఉత్తర దిగభిముఖుడై యేడడుగులు నడచి సర్వసత్త్వములలోను అనుత్తరుడనను అభిప్రాయమును వ్యక్తముచేసెను. క్రింది దిక్కువైపు అభిముఖుడై ఏడడుగులు నడిచి ''నేను మారుని, మారుని సైన్యమును నశింపజేయుదును. నరకాగ్నిని చల్లార్చుట కయి ధర్మమేఘములను సృజించి గొప్పవర్షములను కురిసింతును'' అని వ్యక్తపరచెను. మీదినైపు చూచుచు ఏడడుగులు నడిచి ''సర్వసత్త్వములకును, తలమెత్తి చూడదగియుండు'' నని సూచించెను. బోధిసత్త్వుడు పుట్టినవెంటనే యిట్లన్నివైపుల ఏడేసియడుగులు నడిచి యున్నతాభిప్రాయములను వ్యక్తముచేయుట మిక్కిలి యచ్చెరువు కలిగించెను.

మాయాదేవికి సుపుత్రోదయమైన వెంటనే రాజపురుషులు కొందరు త్వరితగతిని శుద్ధోదనుని వద్దకుపోయి యీ శుభవార్తను తెలియజేసిరి. మహారాజు పరమానందభరితుడై వారికి కానుకల నిచ్చి పంపెను. పెక్కు దానధర్మము లొనర్చెను.

పిదప శుద్ధోదనుడు తనపుత్రుని కే పేరు పెట్టవలెనో యని కొంచె మాలోచించెను. కుమారుడు కలిగినవెంటనే

మహారాజునకు సర్వార్థములును సిద్ధించినవి. ఆ కారణమున సర్వార్థసిద్ధుడని పేరిడుట యుచితమని అట్లే యొనరించెను.

బోధిసత్త్వుడు జనించినపిదప ఏడుదినములవరకును లుంబినీవనమునందే యుండెను. ఏడుదినములైన పిదప అతని మాతృదేవియగు మాయాదేవి మరణించెను. బోధిసత్త్వుని యపరాధమువలన ఆమె విగతజీవయయ్యెనని తలంపరాదు. ఆమె యాయుష్ప్రమాణము ముగియుటయే దానికి కారణము కాని వేరొండుకాదు. మాయాదేవిని మహావైభవముతో లుంబినీవనమును చేర్చిన పరివారజనము ఏడుదినములు గడచినపిదప మాతృహీనుడగు రాజకుమారుని, మహావైభవముతో పురమును చేర్చెను. రాజకుమారుని భద్రముగా సాకుటకు శుద్ధోదనుడు తగిన యేర్పాటుల నొనరించెను. అతనిని పెంచుటకు తగినవారెవ్వరా అని శాక్యులందరు నాలోచింపసాగిరి. రూపయౌవన మదమత్తలగు యువతులెవ్వరు నాపనికి అర్హలు కారని వారు తలంచి, రాజకుమారుని మాతృష్వసయగు గౌతమియే యర్హురాలని నిశ్చయించిరి. ఇట్లు నిశ్చయించి యామెను ప్రార్థింపగా గౌతమి మిక్కిలి సంతసించి, ఎంతో యుత్సాహముతో సర్వార్థసిద్ధుని పోషించుటకు సమ్మతించెను.

౨

ఆ కాలమున పర్వతరాజగు హిమవంతుని పార్శ్వ భాగమున అసితుడను మహర్షి తన భాగినేయుడగు నరదత్తునితో కూడ నివసించుచుండెను. బోధిసత్త్వుడు భూలోకమున నవతరించిన పిదప, దేవపుత్రులు గగనమార్గమున రాకపోక లొనరించుచుండుటను, అతని జననకారణమున నద్భుతములు జరుగుటయు గమనించెను. అట్లు గమనించి దీనికి కారణ మేమియో యని యాలోచించి, యోగదృష్టి వలన బోధిసత్త్వుడు భూలోకమున సర్వార్థసిద్ధుడుగా నవతరించిన విషయమును తెలిసికొనెను. అతడు తన మేనల్లుడగు నరదత్తుని చూచి ''నరదత్తా! ఇది నీకు తెలియునా? కపిలవస్తు మహానగరమును పాలించు శుద్ధోదనున కొక పుత్రుడు కలిగెను. అతడు జంబూద్వీపమునందలి మహారత్నము! అతడు సర్వలోక మహితుడు. ముప్పదిరెండు మహాపురుష లక్షణములు కలిగినవాడు. అతడు గృహమునందే యుండి నచో చక్రవర్తి యగును. అతనికి సప్తరత్నములును లభించును. సన్న్యాసియై గృహ పరిత్యాగమొనరించిన యెడల తథాగతుడై, సమ్యక్సంబోధిని పొంది లోకము నుద్ధరించును. అతనిం జూచుటకు కపిలవస్తుపురమునకు పోవుదము

రమ్ము" అని పలికి, నరదత్తునితో కూడ నా పట్టణమునకు రాజహంస పోవునట్లు గగనమార్గమున పోయెను.

అసితమహర్షి యా నగరమున రాజప్రాసాదమున కేగి, భవనద్వారమున నిలిచి, దౌవారికునిజూచి, రాజదర్శనము నపేక్షించి యొక మహాముని వచ్చెనని మహారాజునకు విన్న వింపవలెనని కోరెను. ద్వారపాలకుడును వేగమే మహారాజు వద్దకుపోయి మహాముని రాకను తెలియజేసెను. "ఆ మహా మునిని శీఘ్రముగా ప్రవేశపెట్టవలె"నని యాజ్ఞాపింపగా, ఆ సేవకుడు సగౌరవముగా అసితమహర్షిని శుద్ధోదనుడున్న యెడకు తీసికొనివచ్చెను.

శుద్ధోదనుడు సాంజలియై మహాముని కెదురేగి తెచ్చి, యర్ఘ్యపాద్యాది విధుల నాతనిం బూజించి, యుచితాసనా సీనుం జేసి "మునివరా! ఇదివరకు తమ దర్శనముచేసికొను భాగ్యము లభింపలేదు. తమ యాగమన కారణమును తెలుప ప్రార్థించుచున్నాను" అని పలికెను.

అసితుడు – "మహారాజా! నీకు పుత్రరత్నము కలిగె నని తెలిసినది. ఆ బాలుని చూడవలెనని అభిలషించు చున్నాను."

శుద్ధోదనుడు – "బాలు డిపుడు నిద్రించుచున్నాడు. కొలదిసేపటిలో నిద్రమేల్కొనును. క్షణకాల మోపికపట్ట వలెనని ప్రార్థించుచున్నాను."

అసితుడు–"మహారాజా! అట్టి మహాపురుషులు చాల సేపు నిద్రింపరు. ఈపాటికి మేలుకొనియే యుండవచ్చును. చూడుడు."

అసితుడిట్లు పలుకుచుండగనే బోధిసత్త్వుడాతని యెడల నుదయించిన యనుకంపతో, తాను నిద్రలేచుటను సూచించెను. వెంటనే శుద్ధోదన మహారాజు తన రెండు చేతులతోను సర్వార్థ సిద్ధుని భద్రముగా నెత్తికొని వచ్చి యసితమహామునికి చూపెను.

ఆమహర్షి రాజకుమారునిం జూచి యాబాలుడు ముప్పది రెండు మహాపురుష లక్షణములలో కూడియుండుటను గుర్తెరింగెను. అతని దివ్యతేజస్సునకబ్బురమందెను. వెంటనే అతడు తాను కూర్చున్న యాసనమునుండి లేచి, కృతాంజలియై, బోధిసత్త్వుని పాదములకు ప్రణమిల్లి, ప్రదక్షిణమొనరించి, యతనిని తన తొడపైనుంచుకొని క్షణమాత్రము ధ్యాననిమగ్నుడై యుండెను. ఆబాలుడు చక్రవర్తిగా గాని, తథాగతుడుగా గాని విశాలయశము నార్జించునని తెలిసికొనెను. పిదప నా మహాముని రాజకుమారునిజూచుచు, దుఃఖముతో గన్నుల నీరుపెట్టుకొని దీర్ఘముగా నిఃశ్వసించె.

అప్పుడు మహారాజు శుద్ధోదనుడా మహామునిని గాంచి "ఏమి మహామునీ! మీరు దుఃఖించుచు, కన్నీరు

విడుచుచున్నారు? దీర్ఘముగా నిట్టూర్పు విడుచుచున్నారు? కుమారున కేమియు నపాయము లేదు కదా?'' అని యాతురతతో ప్రశ్నించెను.

మహాముని మహారాజుంజూచి యిట్లు పలికెను:—
''మహారాజా! బాలున కెట్టి యపాయము లేదు. నే నాతనిం గూర్చి యెంత మాత్రము దుఃఖింప లేదు. ఈ నా దురదృష్టమును గురించి దుఃఖించుచున్నాను. ఈ నా దుఃఖమునకు కారణము లేకపోలేదు. రాజా! నేను వృద్ధుడను. జీర్ణాంగుడను. రాజకుమారుడగు సర్వార్థ సిద్ధుడు తప్పక నాటి లేని సమ్యక్సంబోధిని పొంది, లోకోత్తరమగు ధర్మ చక్రమును ప్రవర్తింపజేయును. అయ్యది మరి యే శ్రమణునకు గాని, బ్రాహ్మణునకు గాని దేవతకు గాని సాధ్యము కాదు. నీ పుత్రరత్నము లోకహితమునకును, లోక సుఖముకొరకును ధర్మము నుపదేశించును. ఆదిమధ్యాంతములలో కల్యాణమయమగు ఉత్తమ విషయమును ప్రకాశింపజేయును. ఆ ధర్మమును వినిన ప్రాణుల కాధివ్యాధి జరామరణము లుండవు. ఇతడుకు మార్గమున సంచరించు ప్రాణులను ఆ మార్గమునుండి తప్పించి ఋజుమార్గమున ప్రవేశపెట్టును. సంసారపంజరమున బంధింపబడి క్లేశములలో మునిగిన సత్త్వములకు బంధమోక్ష మొనర్చి యుద్ధరించును, అట్టి ధర్మ ప్రబోధమును విను నవకాశము నాకు లేకుండుట

వలనను, అట్టి బుద్ధ రత్నమును గాంచు భాగ్యము లేకుండుట వలనను దుఃఖించు చున్నాను.

"మహారాజా! వేదశాస్త్రములంబట్టి చూచినచో సర్వార్థసిద్ధుడు గృహమున నివసింపడనియే తెలియుచున్నది. ఏలయన – నీ కుమారుడు ముప్పదిరెండు మహాపురుష లక్షణములు కలిగియున్నాడు. ఇతని శరీరావయవములలో నెనుబది శుభ చిహ్నములు కానవచ్చుచున్నవి. ఇట్టి లక్షణములు కలమహాపురుషుడు గృహమునుండి అభినిష్క్రమణ మొనర్చుననియే తెలియుచున్నది."

పిదప శుద్ధోదనమహారాజు మహర్షియగు నసితుని యంకమునుండి కుమారుని తీసికొని శయనముపయి పరుండబెట్టెను. తన పుత్రుడు గొప్పకీర్తిని సంపాదించి, లోకోద్ధారకుడగునని యా మహాముని చెప్పిన వచనమునకు మిక్కిలి యానందించెను. తన పుత్రుడు దేవతామూర్తి యని గ్రహించి, మిక్కిలి భక్తితో అతని చరణములకు నమస్కరించి "ఓ మహనీయా! ఇంద్రాది దేవతలు నిన్ను కొనియాడుచున్నారు. మహర్షులు నిన్ను పూజించు చున్నారు. సమస్తలోకములలోని సత్త్వముల జరామరణాధివ్యాధులను పోగొట్టుటలో నీవు గొప్పవైద్యుడవు. ఇట్టి నీకు నమస్కరించుచున్నాను" అని పలికెను.

పిదప మహారాజు మహర్షి యగు నసితమునిని, అతని భాగినేయుడగు నరదత్తుని భక్తితో తృప్తిపరచెను. వారికి ప్రదక్షిణమొనర్చెను. అసితమహర్షియు నరదత్తునితోకూడ అచ్చటినుండియే యాకాశమార్గమునపోయి తన యాశ్రమమును చేరుకొనెను.

ఆశ్రమమును చేరిన పిదప మహర్షి మేనల్లుని పిలిచి "నరదత్తా! బుద్ధుడు లోకమునం దవతరించెనను జనవాక్యమును వినిన పిదప, అతనివద్దకు పోయి, ఆతని శాసనము ననుసరించి సన్యాసమును స్వీకరింపుము. దానివలన నీకు హితము, సుఖము కలుగును. సర్వార్థములు సిద్ధించును" అని పలికెను.

బోధిసత్త్వుడు భూలోకమునం దవతరించిన వృత్తాంతమును తెలిసికొని మహేశ్వరుడను దేవపుత్రుడు శుద్ధావాసకాయికులగు దేవపుత్రులను పిలిచి, వారితో నిట్లు పలికెను. "మిత్రులారా! లోకోత్తరగుణసమన్వితుడును, జాతిజరామరణములను నశింపజేయువాడును, సమస్తదేవమనుష్యగణపూజితుడును అగు బోధిసత్త్వుడు మనుష్యలోకములోని ఇక్ష్వాకురాజకులమునం దుద్భవించెను. అతడు లోకోత్తరమగు సమ్యక్సంబోధిని లోకమున వెల్లడింపగలడు. అతనిని గౌరవించుటకును, పూజించుటకును పోవు

దము రండు. కొందరు దేవపుత్రులు మానమదాహంకార ములతో తామే గొప్పవారమని గర్వించుచున్నారు. ఇట్టి యెడ మనము బోధిసత్త్వుని గౌరవించి, పూజించినయెడల, ఆ దేవపుత్రులుకూడ నాతనిని గౌరవించి, పూజించగలరు. దానివలన గొప్పహితము, సుఖము, అర్థసిద్ధియును కలుగ గలవు. మనము బోధిసత్త్వుని దర్శించి తిరిగి వత్తము.''

ఇట్లు పలికి మహేశ్వరుడు లక్షలకొలదిగా ఉన్న దేవపుత్రులతో కూడ కపిలవస్తుమహానగరమునకు పోయి మహారాజగు శుద్ధోదనుని మందిరమునకు వెళ్ళి దౌవారికుని మూలమున తనరాకను మహారాజునకు తెలియబరచెను. పిదప రాజానుమతిని పొంది, రాజకులమును ప్రవేశించి, బోధి సత్త్వుని దర్శించి, యాతని పాదములకడ శిరస్సునుంచి మ్రొక్కి పెక్కుమారులు ప్రదక్షిణముచేసెను. పిదప నా రాజకుమారుని తనతొడపై నిడుకొని శుద్ధోదనునకు సంతృప్తిని కలిగించెను. ''మహారాజా! నీకుమారుడు బోధి సత్త్వుని లక్షణములు కలిగియున్నాడు. నీవు మిక్కిలి యదృష్ట వంతుడవు; సంతుష్టుడవు కమ్ము. నీ కుమారుని కాయము బోధిసత్త్వుని లక్షణములతోను, మహాపురుష లక్షణ ములతోను అలంకృతమైయున్నది. ఈ కుమారుడు తేజము నను, వర్ణముననను, యశస్సుచేతను, సంపదచేతను దేవ మానుషా సురలోకముల నన్నింటిని ప్రకాశింపజేయును.

ఇందు సందేహ మెంతమాత్రము లేదు. ఇతడు తప్పక లోకోత్తరమగు సమ్యక్సంబోధిని బోధింపగలడు'' అనియును అతడు వివరించెను.

ఇట్లు దేవపుత్రుడగు మహేశ్వరుడు శుద్ధావాస కాయికులగు దేవపుత్రులతో కూడ బోధిసత్త్వుని, పూజించి, అతనిమహాత్తును వివరించి తెలిపి స్వభవనమునకు పోయెను.

## ౬

బోధిసత్త్వుడు జంబూద్వీపమున మాతృదేవియగు మాయాదేవీ గర్భమున సర్వార్థసిద్ధుడై జన్మించిననాడే వేల కొలది కన్యలు బ్రాహ్మణ కులమునందును, క్షత్రియ వంశమునను, నైగమ వంశమునందును, గృహపతికులమునను, మహాసాల గోత్రమునందును జన్మించిరి. అందరును శీల సంపన్నలు, లోకోత్తర సౌందర్యవతులు. అన్ని విధముల బోధిసత్త్వుని సేవించుట కర్హులై యున్నారు. ఆ కన్యల తలిదండ్రులు బాగుగా ఆలోచించి బోధిసత్త్వుని పరిచర్య చేయుటకై వారిని నియమింప నిశ్చయించిరి. ఈ రీతినే మహారాజగు శుద్ధోదనుడును పెక్కుమంది కన్యలను రాజకుమారుని పరిచర్యకొరకై ప్రత్యేకించెను. రాజమిత్రులును, రాజామాత్యులును. రాజబంధువులును, జ్ఞాతులునుకూడ వేలకొలది కన్యలను రాజకుమారుని పరిచర్యకొరకయి నియమించిరి.

శాక్యవంశీయులకు దైవభక్తి మెండు. వారి వంశమున సుపుత్రుడు జన్మించిన పిదప దేవాలయమునకు తీసికొనిపోయి దేవతా విగ్రహములకు మ్రొక్కించుట వారి సంప్రదాయము. ఆ సంప్రదాయము ననుసరించి రాజ

కుమారుని దేవాలయమునకు దీసికొనిపోవలసియున్నదని రాజ బంధువులు మహారాజునకు తెలిపిరి. శుద్ధోదనుడు సంతసముతో 'వల్లె' యని దాని కంగీకరించెను. దానికయి తగిన యేర్పాటులు జరుపబడెను.

మహారాజు నానతి ననుసరించి నగరము చక్కగా అలంకరింపబడెను. రచ్చలు, రథ్యలు, చతుష్పథములు, విపణివీథులు శోభాయమానములుగా నొనర్చబడెను. అమంగళకరములగు వస్తువులన్నియును తొలగింపబడెను. వీథులలో కుంటి, గ్రుడ్డి, చెవిటి, మూగ, మున్నగు నంగ విహీనులును, వికారస్వరూపులును లేకుండునట్లు చేయబడెను. దేవాలయమార్గమున మంగళకర వస్తువులుంచబడెను. పటహభేరీతూర్యాది మంగళధ్వనులు పెల్లు రేగుచుండెను. సామంతరాజులు, శ్రేష్ఠివర్యులు, గృహపతులు, మంత్రులు, పారిషదులు రాజకుమారుని వెంట దేవాలయమునకు పోవునట్లు కట్టడ జరిగెను. పూర్ణకుంభములు నిలుపబడెను. వేదాధ్యయనపరులగు బ్రాహ్మణులును రాజకుమారునితోపాటు దేవాలయమునకు అతని వెంట వెళ్లునట్లు కోరబడిరి. రాజకుమారుడు పోనున్న దేవాలయము మిక్కిలి యందముగా అలంకరింపబడెను.

శుద్ధోదనమహారాజు స్వభవనమును ప్రవేశించి దేవియగు గౌతమిని పిలిచి యిట్లనెను. "దేవీ! కుమారుని

చక్కగా అలంకరింపవలెను. సర్వార్థసిద్ధుని దేవాలయమునకు దేవదర్శనార్థము పంపవలసియున్నది. ఇది మనకు కులక్రమాగతమగు ఆచారము.''

దేవియగు గౌతమి యట్లే చేసెదనని చెప్పి, కుమారునలంకరించుటలో నిమగ్నురాలయ్యెను.

తన మాతృష్వస తన్నేల అలంకరించుచున్నదో సర్వార్థసిద్ధునకు తెలియును. ఆమె చెప్పకున్నను, ఆతడు గ్రహించెను. గ్రహించి చంద్రమండలమువంటి ముఖమున చిరునవ్వు తొలకాడ, ప్రసన్నభావముతో మధురమధురముగా ''అమ్మా! కారణములేక నన్నిట్లలంకరింపవు. నన్నెచ్చటికో తీసికొని వెళ్ళుటకే యీ ప్రయత్నమని తోచుచున్నది. నన్నెచటికి తిసికొనిపోవుదురు?'' అని ప్రశ్నించెను. ''నాయనా! నిన్ను దేవతాయతనమునకు తీసికొనివెళ్ళుదురట! రాజకుమారులు తొట్టతొలుత రాజసౌధమును వీడి దేవాలయమునకు పోయి భగవద్దర్శనము చేసికొనివచ్చుట కులాచారము'' అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

అంత రాజకుమారుడు చిరునవ్వునవ్వి యామెతో ఇట్లనెను. ''అమ్మా! నేను జన్మించిన సమయమున వేలకొలది దేవతలతో బ్రహ్మయు, ఇంద్రుడును వచ్చి, తమ శిరస్సులను నాపాదములదగ్గర చేర్చి నమస్కరించిరి. దేవ

తలవలెనే అసురులును, నాగులును నన్నుచూచి, నమస్కరించి ప్రశంసించిరి. సూర్యచంద్రులును, వైశ్రవణుడును వచ్చి యంజలులు ఘటించిరి. నాకంటె విశిష్టుడగు దేవాధీశుడు లేడు. కావున నే నేదేవతకును నమస్కరింప నక్కర లేదు. నేనే దేవతలనందరి నతిక్రమించిన దేవుడను. సర్వోత్తముడను. నాకు సదృశుడైన దేవుడు లేడు. అయినను, దేవకులమున కేగి, దేవుని దర్శించుట కులాచారమగుట వలన, దాని నతిక్రమించుట భావ్యము కాదు; నేనీ సదాచారము నతిక్రమించినయెడల లోకులందరు నతిక్రమింతురు. అందువలన సదాచారములు నశించిపోవును. మరియు మాతృదేవతి కోరికను తిరస్కరించుట భావ్యము కాదు. కావున తండ్రిగారి యానతికిని, మీ యానతికిని విరుద్ధముగా ప్రవర్తింపక దేవకులమున కేగెదను'' అని పలికెను.

రాజకుమారుడు దేవకులమున కొక దివ్యరథము నెక్కిపోనాగెను. శుద్ధోదన మహారాజు గొప్ప రాజవ్యూహముతో కుమారుని దేవాలయమునకు తీసికొని పోవుచుండెను. సర్వార్థసిద్ధుడు కూర్చున్న రథమును వేలకొలది దేవతలు వహించుచుండిరి. ప్రయాణసమయమున పురజనులా రథముపై పుష్పవర్షమును కురియించుచుండిరి. మార్గమంతయు సుగంధధూపములతో ధూపితమగుచుండెను.

రాజకుమారుడు దేవకులమును ప్రవేశించెను. శుద్ధోదనుడు సిద్ధార్థునిచే తొలుత కుడిపాదమును దేవగృహమున పెట్టించెను. దేవాలయమునందలి విగ్రహములన్నియు నచేతనములు. అచట శివుడు. స్కందుడు, నారాయణుడు, కుబేరుడు, చంద్రుడు, సూర్యుడు, వైశ్రవణుడు, ఇంద్రుడు, బ్రహ్మ, లోకపాలురు మున్నగు దేవతల ప్రతిమలు కలవు. సర్వార్థసిద్ధరూపుడగు బోధిసత్త్వుడు ఆ దేవాలయమున ప్రవేశించిన వెంటనే యా విగ్రహములన్నియును చలించి, తమతమ స్థానములనుండి లేచి, అతని పాదతలముల పయి పడసాగినవి. ఈ విచిత్ర సంఘటనంగాంచి యచట వేల కొలదిగానున్న దేవమనుష్యగణము లాశ్చర్యముతో హీంహీంకారములను. కిలకిల ధ్వనులను చేయుచు, సంతోషమును పట్టలేక చేలిగుడ్డలను విసరసాగిరి. కపిలవస్తు మహానగరమంతయు నీ సంఘటనకు కంపించిపోయెను. గగనతలము నుండి దివ్యకుసుమములు వర్షించెను. శతసహస్ర సంఖ్యలో తూర్యముల ధ్వనులు వినవచ్చెను. దేవతల ప్రతిమ లన్నియును స్వస్వరూపమును పొంది యిట్లనుకొనెను:—

“పర్వతరాజగు మేరువునెదుట ఆవగింజలవలెను, నాగరాజనిలయమును, సువిశాలమునగు సాగరముముందట అత్యంత స్వల్పమగు గోష్పదమువలెను, దివ్యతేజస్సులతో ప్రకాశించుచుండు సూర్యచంద్రుల సమక్షమున ఖద్యోతము

వలెను. లోకోత్తరగుణగణములను ధరించిన బోధిసత్త్వుని యెదుట మేమందరము నిష్ప్రభులమై, నిష్క్రియులమై యున్నాము. దేవమనుష్యులలో నెవ్వరు నితనికి సాటికారు. స్వయంభువులలో నీతడు ఉత్తముడు. ఈతని మూలముననే లోకము స్వర్గసుఖమును, నిర్వృతిని పొందును.''

బోధిసత్త్వుడు దేవకులమును ప్రవేశించుటను చూచిన దేవపుత్రులందరికిని సమ్యక్సంబోధియెడల, చిత్తములందాసక్తి యుత్పన్నమయ్యెను.

౭

శుద్ధోదనమహారాజు పురోహితు డుదయనుడు. అతడు పంచశత సంఖ్యాపరిమితిగల బ్రాహ్మణులతో కూడ, చిత్రా నక్షత్రయుక్త శుభసమయమున మహారాజువద్దకు వచ్చి "దేవా! రాజకుమారునకు తగిన యాభరణములను చేయించి, వానిచే అలంకరింపవలసియున్నది. దాని కిదియే సమయము. ఈ విషయమును ప్రభువుల కెరిగించుట మా విధి. కావున మనవిచేయుచున్నాను" అని విన్నవించెను. దానికి మహారా జంగీకరించి, ఆభరణములను నిర్మింపజేయు కార్యమును శాక్యరాజగు భద్రికున కప్పగించెను.

శాక్యరాజగు భద్రికుడు పంచశత సంఖ్యాకులగు శాక్యులతో సంప్రతించి పంచశత సంఖ్యాకములగు ఆభరణములను చేయించెను. అవి యేవనగా—హస్తాభరణములు, పాదాభరణములు, మూర్ధాభరణములు, కర్ణాభరణములు, ముద్రికాభరణములు, కేయూరములు, మేఖల, సువర్ణ సూత్రములు, మువ్వలు, మణిప్రత్యుప్తములగు రత్నజాలములు, పాదుకలు, వివిధ రత్నములతో కూడిన హారములు, కడియములు, కిరీటములు మున్నగునవి.

ఈ యాభరణముల నన్నింటిని చేయించి, పుష్యా

వలెను. లోకోత్తరగుణగణములను ధరించిన బోధిసత్త్వుని యెదుట మేమందరము నిష్ప్రభులమై, నిష్క్రియులమై యున్నాము. దేవమనుష్యులలో నెవ్వరు నితనికి సాటికారు. స్వయంభువులలో నీతడు ఉత్తముడు. ఈతని మూలముననే లోకము స్వర్గసుఖమును, నిర్వృతిని పొందును.''

బోధిసత్త్వుడు దేవకులమును ప్రవేశించుటను చూచిన దేవపుత్రులందరికిని సమ్యక్సంబోధియెడల, చిత్తములందాసక్తి యుత్పన్నమయ్యెను.

## ౭

శుద్ధోదనమహారాజు పురోహితు డుదయనుడు. అతడు పంచశత సంఖ్యాపరిమితిగల బ్రాహ్మణులతోకూడ, చిత్రా నక్షత్రయుక్త శుభసమయమున మహారాజువద్దకు వచ్చి "దేవా! రాజకుమారునకు తగిన యాభరణములను చేయించి, వానిచే అలంకరింపవలసియున్నది. దాని కిదియే సమయము. ఈ విషయమును ప్రభువుల కెరిగించుట మా విధి. కావున మనవిచేయుచున్నాను" అని విన్నవించెను. దానికి మహారా జంగీకరించి, ఆభరణములను నిర్మింపజేయు కార్యమును శాక్యరాజగు భద్రికున కప్పగించెను.

శాక్యరాజగు భద్రికుడు పంచశత సంఖ్యాకులగు శాక్యులతో సంప్రతించి పంచశత సంఖ్యాకములగు ఆభరణములను చేయించెను. అవి యేవనగా—హస్తాభరణములు, పాదాభరణములు, మూర్ధాభరణములు, కర్ణాభరణములు, ముద్రికాభరణములు, కేయూరములు, మేఖల, సువర్ణ సూత్రములు, మువ్వలు, మణిప్రత్యుప్తములగు రత్నజాలములు, పాదుకలు, వివిధ రత్నములతోకూడిన హారములు, కడియములు, కిరీటములు మున్నగునవి.

ఈ యాభరణముల నన్నింటిని చేయించి, పుష్యా

నక్షత్రయుక్తమగు శుభసమయమున శాక్యులందరును శుద్ధోదనునివద్దకు పోయి "దేవా! ఆభరణములన్నియును సిద్ధమైనవి. వానిని ప్రభువులు గ్రహించి, వానితో రాజకుమారు నలంకరింపగోరెదము" అని మనవిచేసిరి.

శుద్ధోదనుడు "చిరంజీవి యీవరకే అలంకరింపబడి యున్నాడు. అతనిని మీరు పూజించియు నున్నారు. అయి నను కొన్ని యాభరణములను చేయించుట జరిగినది" అనెను. అప్పుడు శాక్యులు "రాజకుమారునకు వారములోని యేడు దినములు ధరించుటకు వేర్వేరు నగలను నిర్మింప జేసితిమి. అవి యుపయోగింపబడనియెడల మా శ్రమ యంత యును వ్యర్థమగును. రాజకుమారుడు వీనిని ధరించిన యెడల మా ప్రయత్నము సఫలమగును. మాకు సంతృప్తి యును కలుగును" అని విన్నవించిరి. శుద్ధోదన మహారాజు వారికోరికను మన్నించెను.

ఆ రాత్రి గడచి సూర్యోదయమైనపిదప రాజకుమా రున కాభరణములు పెట్టుటకు నిర్ణయింపబడెను. రాజ మహిషియగు గౌతమి రాజకుమారుని విమలవ్యూహమను సుందరోద్యానమునకు తీసికొనివెళ్లెను. వేలకొలది దాసీజన మామె వెంట నుండెను. గౌతమి రాజకుమారుని తన తొడపై గూర్చుండబెట్టుకొనెను. పంచశత సంఖ్యగల బ్రాహ్మణులు రాజకుమారున కెదురుగా వచ్చి యభినందించి, యతని

ప్రసన్నముఖమునే చూచుచు ముగ్ధులగుచుండిరి. రాణి చెలికత్తెలు వివిధాభరణములతో రాజకుమారు నలంకరింప సాగిరి. సాధారణముగా నాభరణములు శరీరశోభ నినుమడింపజేయును. కాని, బోధిసత్త్వున కా యాభరణములు అణుమాత్రమైనను శోభను గూర్చలేకపోయినవి. అతని దేహకాంతిముందు నగలన్నియును నిస్తేజములై పోయెను. పెట్టినబంగారము నెదుట నల్లని మట్టిముద్ద భాసింపని విధమున బోధిసత్త్వుని శరీరచ్ఛాయ యెదుట ఆ యాభరణములు ప్రకాశింపలేక కళావిహీనములయి వెలవెల పోయినవి. ఏ యాభరణమును పెట్టినను, అది నిష్ప్రయోజనముగనే కానవచ్చెను.

ఆవనమున విమలయను నుద్యానదేవత కలదు. ఆమె మానవ రూపధారిణియై శుద్ధోదనుని యెదుట నిలిచి యిట్లు పలికెను:—

"మహారాజా! ఈ మేదినియందు కాంచన మణి రత్నాదులచే నిర్మింపబడిన ఆభరణములన్నియును శరీరమున కందము నిచ్చి, తేజస్సును కూర్చును. కాని, ఈ విలువైన యాభరణములు రాజకుమారుని శరీరకాంతివలన నిస్తేజములై నిరర్థకము లయినవి. నీ కుమారుడగు సర్వార్థసిద్ధుడు సర్వ గుణాలంకృతుడు! ఇతడు స్వతేజముననే మిక్కిలి ప్రకాశించును. విమలమగు శరీరముకల యితని

కాభరణములతో పని లేదు. ఇతని తేజస్సు సూర్యచంద్రుల యొక్కయు, నక్షత్రములయొక్కయు, బ్రహ్మేంద్రాది దేవతలయొక్కయు తేజస్సు నతిక్రమించి యున్నది. సహజ గుణ భూషణుడగు రాజకుమారునకు కృత్రిమ భూషణములు నిరుపయోగములు. ఈ యాభరణముల నన్నింటిని, రాజకుమారుని జనన సమయమునందే పుట్టిన హితభృత్యు డగు ఛందకున కిచ్చుట మేలు. వీనిని ధరించి యతడు శోభించును.''

ఇట్లు పలుకుచు ఆ వనదేవత బోధిసత్త్వునిపయి దివ్య పుష్పములను వర్షించి యచ్చటనే యంతర్ధాన మొందెను. ఈ సంఘటనమును చూచి శాక్యులందరును విస్మితులై మిక్కిలి యానందించిరి.

౮

కొన్ని వసంతములు గడచినవి. రాజకుమారుడు పెరిగి విద్యాభ్యాసమునకు తగిన వయస్సును పొందెను. మంత్రి, పురోహితులును, హితులును శుద్ధోదన మహారాజు వద్దకు పోయి "ప్రభూ! రాజకుమారునకు విద్యాభ్యాస మొనర్చు సమయము వచ్చినది. దానికయి యత్నింప వలెను. ప్రభు కుమారునకు రాజభవనమునందే సమస్త విద్యలను బోధించుట సులభమును, సుసాధ్యము నగును. అయినను కులాచారము ననుసరించి లిపిశాలకు తీసికొనిపోయి, వ్రాయను చదువను నేర్పించుట యెంతయు నుచితము" అని విన్నవించిరి.

శుద్ధోదను డట్లేయని సమ్మతించి దానికి వలయు నేర్పాట్లను కావించెను. వెనుక రాజకుమారుడు దేవకులమునకు వెళ్ళునప్పటివలెనే పురమంతయునలంకృతమయ్యెను. సర్వార్థసిద్ధుని గమ్యస్థానమగు లిపిశాల మిక్కిలి యాకర్షణీయముగ సజ్జమయ్యెను. వందలకొలది తూర్యధ్వానులు మిన్నుముట్టెను. చక్కగా అలంకరించుకొన్న పౌరయువతులు వితర్దికలపైని, సౌధో పరిభాగముల పైని, గవాక్షములందును నిలిచి రాజకుమారుని రాకకై నిరీక్షింపసాగిరి.

అతడు నగరవీధులనుండి పోవునపుడు వా రాతనిపయి పుష్ప వర్షమును కురిపింపసాగిరి. దేవ నాగయక్ష గంధర్వ కిన్నరా సుర గరుడ గణములు గగనమార్గమున నిలిచి పుష్పమాలలను కరములతో గ్రహించి బోధిసత్త్వ ప్రతిరూపుడగు సర్వార్థసిద్ధునిపయి ప్రక్షేపించు చుండిరి.

రాజకుమారుడు రథారూఢుడై లిపిశాలకు పోవుచుండెను. మహారాజగు శుద్ధోదనుడు శాక్య గణములతో గూడ రథమునకు పురోభాగమున పోవుచుండెను.

కులగురువగు విశ్వామిత్రుడు రాజకుమారున కధ్యాపకుడు. అతడు లిపిశాలలో రాజకుమారుని రాకకై యెదురు చూచుచుండెను.

సర్వార్థ సిద్ధుడు లిపిశాలను ప్రవేశించెను. అతని శరీరశోభతోను, తేజస్సుతోను లిపిశాల నిండిపోయెను. విశ్వామిత్రుడు బోధిసత్త్వుని తేజస్సును సహింపలేక అధోముఖుడై భూతలమున పడిపోయెను. అత డట్లు పడిపోవుచుండగా చూచి శుభాంగుడను పేరుగల తుషిత కాయికుడగు దేవపుత్రుడు నేలపై పడకుండ అతనిని నిలిపెను. ఆ దేవ పుత్రుడు గగన తలమున నిలిచియే మహారాజగు శుద్ధోదనుడును, జనసమూహమును వినునట్లుగా ఇట్లు పలికెను:

''మనుష్యలోకమునందే యే శాస్త్రములు కలవో అవి యన్నియు, సంఖ్యాలిపి, గణన, ధాతుతంత్రము, అస్త్ర

మేయమగు శిల్పము మున్నగు వానినన్నింటిని తొల్లి పెక్కు కల్పములకు ముందే బోధిసత్త్వు డెరింగియున్నాడు. ఇతనికి లిపి శాలాప్రవేశ మక్కరయే లేదు. కాని, లోకు లందరును, ఇట్టి సదాచారమును విడువకుండ అనుసరింపవలెనను నాశయముతోనే యిప్పుడు లిపిశాలను ప్రవేశించుచున్నాడు. శుద్ధసత్త్వుడగు నీ బోధిసత్త్వుడు క్షణమాత్రముననే రూపరహితములై జనుల మనస్సులలో నణగియున్న భావముల నన్నింటిని సులభముగా గ్రహింపగలడు. అట్టి యద్భుతశక్తికల యీతని కక్షరరూపమున నున్న లిపులన్నియును తెలియుటలో వింత యేమున్నది?''

ఇట్లు పలికి యీ దేవపుత్రుడు దివ్యకుసుమములతో సర్వార్థసిద్ధుని పూజించి యచ్చటనే అంతర్ధానమును పొందెను.

రాజకుమారుడు లిపిశాలలో ప్రవేశించినపిదప శుద్ధోదనమహారాజు శాక్యగణముతోకూడ వెనుకకు మళ్లెను. రాజకుమారుని ధాత్రులు, చేటికలు మాత్రమే రాజకుమారుని చేరువ నిలిచియుండిరి.

రాజకుమారునికి లిపిఫలక మొకటి యీయబడెను. అది దివ్యార్ష సువర్ణతిరకము (బలపము) కలిగి, చుట్టును మణులతో అలంకరింపబడి యుండెను. ఆ పలకకు ఉరగ

సార చందనము పూయబడియుండెను. సర్వార్థసిద్ధుడా పలకను గ్రహించి గురూత్తముడగు విశ్వామిత్రునితో ఇట్లు పలికెను:—

"గురువర్యా! లోకములో అసంఖ్యాకములైన లిపులున్నవి. వానిలో అరువదినాలుగు ముఖ్యమైనవి. అవి ఏవన:- బ్రాహ్మీలిపి, ఖరోష్ఠీలిపి, పుష్కరసారిలిపి, అంగలిపి, వంగలిపి, మగధలిపి, మాంగల్యలిపి, అంగుళీయలిపి, సుకారిలిపి, బ్రహ్మవలి లిపి, పారుష్యలిపి, ద్రావిడలిపి, కిరాతలిపి, దాక్షిణ్యలిపి, ఉగ్రలిపి, సంఖ్యాలిపి, అనులోమ లిపి, అపమూర్ధలిపి, దరదలిపి, ఖాష్యలిపి, చీనలిపి, లూనలిపి, హూణలిపి, మధ్యాక్షర విస్తారలిపి, పుష్పలిపి, దేవలిపి, నాగరలిపి, యక్షలిపి, గంధర్వలిపి, కిన్నరలిపి, మహోరగలిపి, అసురలిపి, గరుడలిపి, మృగచక్రలిపి, వాయసరుతలిపి, భౌమదేవలిపి, అంతరిక్షదేవలిపి, ఉత్తరకురుద్వీప లిపి, అపరగోదానీలిపి, పూర్వవిదేహలిపి, ఉత్ క్షేపలిపి, నిక్షేప లిపి, విక్షేపలిపి, ప్రక్షేపలిపి, నాగరలిపి, వజ్రలిపి, లేఖప్రతి లేఖలిపి, అనుద్రుతలిపి, శాస్త్రావర్తలిపి, గణావర్తలిపి, ఉత్ క్షేపావర్తలిపి, పాదలిఖితలిపి, ద్విరుత్తరపద సంధిలిపి, యావద్దశోత్తరపదసంధిలిపి, అధ్యాహారణీలిపి, సర్వరుత సంగ్రహిణీలిపి, విద్యానులోమావిమిశ్రిత లిపి, ఋషి తపస్తప్తాలిపి, రోచమానలిపి, ధారుణీప్రేక్షణీలిపి, గగన

ప్రేక్షణీలిపి, సర్వౌషధీ నిష్యందలిపి, సర్వసార సంగ్రహిణీ లిపి, సర్వభూత రుతగ్రహణీలిపి-అనునవి. ఓ గురూత్తమా! వీనిలోని ఏ లిపిని నాకు బోధింపనున్నావో తెలుపుడు."

రాజకుమారుడు పలికిన యీ మాటలను విని, అతని కాచార్యుడైన విశ్వామిత్రుడు మిక్కిలి యాశ్చర్యపడెను. సంతోషపారవశ్యమున నతని ముఖమున చిరున వ్వంకురించెను. అతని మానమద దర్పములు నశించెను.

విశ్వామిత్రుడా సమయమున తనలో ఇట్లనుకొనెను- "ఆహా! ఎంత ఆశ్చర్యము! లోకానువర్తియగు నీ శుద్ధ సత్త్వునకు సర్వశాస్త్రములు, సర్వలిపులు కరతలామలకములు. ఈతడు వర్ణించిన లిపులనే కాదు. కొన్ని లిపుల పేర్లుకూడ నాకు తెలియవు. సర్వలిపి పారగుడైన యీతనికి నేనేమి బోధింపగలను? ఏ లిపిని నేర్పగలను? ఇతడు దేవ దేవుడును, విభుడును అగు సర్వోత్తముడు. విశిష్టుడు. ఇతనికి సాటియగువాడు కానరాడు. నే నితని ప్రభావమువలననే ప్రజ్ఞోపాయములను గ్రహించి, సర్వలోక పరాయణుడును, సుశిక్షితుడునగు నీతనికి కులాచారము ననుసరించి బోధింపవలసి యున్నది."

బోధిసత్త్వుడు జంబూద్వీపమున శుద్ధోదనుని పుత్రుడుగా అవతరించిననాడే శాక్యవంశమున వేలకొలది బాల

కులు జన్మించిరి. వారందరును సర్వార్థసిద్ధునితో పాటు లిపి శాలను ప్రవేశించి విశ్వామిత్రుని యధ్యాపకత్వమున విద్యాభ్యాసమునకు గడంగిరి. అకారము నుచ్చరించినపుడు అనిత్యమగు సర్వసంస్కారశబ్దము గోచరించెను. ఆకారము నుచ్చరించినపుడు ఆత్మపరహితశబ్దము వచ్చెను. ఇట్లే ఇకారము నుచ్చరించినప్పుడు ఇంద్రియవైకల్యశబ్దము, ఈ కారోచ్చారణమున జగమంతయు ఈతిబహుళమనువిష యము తెలిసెను. ఉకారము నుచ్చరించునపుడు లోక మంతయు ఉపద్రవములతో కూడినదని తెలియవచ్చెను. ఊకారోచ్చారణమున లోకమంతయు ఊనసత్త్వమని తెలిసెను. ఏకారోచ్చారణమున ఏషణాసముత్థానదోషము వ్యక్తమయ్యెను. ఐకారోచ్చారణమున ఐర్యాపథము శ్రేయస్కరమని కానవచ్చెను. ఓకారమువలన ఓఘోత్తర శబ్దము, ఔకారమువలన ఔపపాదికశబ్దము, అంకారము వలన అమోఘోత్పత్తిశబ్దము, అఃకారమువలన అస్తంగ మనశబ్దము గోచరములయ్యెను. ఇట్లే కకారమువలన కర్మ విపాకావతారము, ఖకారమువలన ఖసమ సర్వధర్మశబ్దము, గకారమున గంభీరధర్మప్రతీత్యసముత్పాదావతారశబ్దము, ఘకారమున ఘనపటలమగు అవిద్యామోహాంధకారనివ ర్తనము, జకారమువలన అంగవిశుద్ధిశబ్దము వ్యక్తము లయ్యెను. చకారమువలన చతురార్యసత్యశబ్దము, ఛకార

మున ఛందరాగప్రహాణశబ్దము, జకారమువలన జరామరణ
సమతిక్రమణశబ్దము, ఝకారమున ఝషధ్వజబలనిగ్రహాణ
శబ్దము, ఞకారమున జ్ఞాపనశబ్దము వినవచ్చెను. టకార
మున పటోపచ్ఛేదనశబ్దము, ఠకారమున ఠపనీయప్రశ్న
శబ్దము, డకారమువలన డమరమారనిగ్రహాణశబ్దము,
ఢకారమున మీఢవిషయములనియు, ణకారమున రేణు
క్లేశములు, తకారమున తథతాసంభేదశబ్దము, థకారమున
థామబలవేగవైశారద్యశబ్దము, దకారమున దానదమ
సంయమసౌరభ్యశబ్దము గోచరించెను. ధకారమువలన
ఆర్యులకు ధనము సప్తవిధమనియు, నకారమున నామరూప
పరిజ్ఞానము, పకారమున పరమార్థము, ఫకారమువలన
ఫలప్రాప్తి, బకారమున బంధమోక్షము, భకారమువలన
భవవిభవము, మకారమున మానమదోపశమనము,
యకారమువలన యానాస్వర్గప్రతిబోధనము, రకారమువలన
రత్యరతిపరమార్థరసములు, లకారమున లతాచ్ఛేదనము,
వకారమున వరయానము, శకారమున శమథవిపశ్యనా
శబ్దము అనగాహితములయ్యెను. షకారమువలన షడాయ
తన నిగ్రహాణాభిజ్ఞ జ్ఞానావాప్తియు, సకారమున సర్వజ్ఞ
జ్ఞానాభిసంబోధనము, హకారమున హతక్లేశవిరాగము.
క్షకారమువలన క్షణపర్యంతమైన అభిలాష్యసర్వధర్మ
శబ్దము వ్యక్తములయ్యెను,

ఈరీతిని శాక్యబాలులందరును అక్షరముల నభ్య సించు సమయమునందే వారి హృదయములలో బోధి సత్త్వుని యనుభావమువలన అసంఖ్యేయములగు నుత్తమ ధర్మములన్నియు గోచరించెను. అందరికిని లోకోత్తరమగు సమ్యక్సంబోధియెడల మనస్సులలో నాసక్తి యుద్భవించినది. బోధిసత్త్వుడు లిపిశాలాప్రవేశ మొనర్చుట కిట్లు బాలకుల కందరికిని ధర్మబుద్ధి కలిగించుటయే కారణము.

౯

సిద్ధార్థుడు పెరిగి పెద్దవాడైన పిదప తోడిబాలుర తోను, మంత్రి పుత్రులతోను కలసి చుట్టు పట్టునగల యొక గ్రామమునకు వెళ్లెను. అక్కడ జరుగుచున్న కృషికర్మను చూచిన తర్వాత సమీపమునందున్న ఉద్యానవనము ప్రవే శించెను. ఎందులకో అతని మనస్సు కలత పడియుండెను. అందువలన అతడు ఒంటరిగా, మరెవ్వరును తోడులేక ఉద్యాన వనమంతటను తిరుగుచు, ఒకచోట ఆకర్షణీయ ముగానున్న ఒక నేరెడు చెట్టును చూచెను. అతడు దాని నీడలో పర్యంక బంధమున కూర్చుండెను. కూర్చుండి మనస్సును ఏకాగ్రముగ నుంచెను. ఆ ఏకాగ్రతలో లీనుడై ధ్యానలాభమును పొంది విహరింప దొడగెను.

ఆ సమయమున గొప్ప మాహాత్మ్యముగల ఐదుగురు ఋషులు గగన మార్గమున దక్షిణదిక్కునుండి ఉత్తర దిక్కు నకు వెళ్లుచుండిరి. వారు సిద్ధార్థుడు ధ్యానావస్థలోనున్న ఉద్యానవనము మీదుగ వెళ్లుట తటస్థించెను. ఎవరో అడ్డు కొనినట్లు వారి ప్రయాణము అసాధ్యమాయెను. "ఏమిది? తీయమామిడిచెట్లు గజిబిజిగా అల్లుకొనియున్న వన బృం దమును గజరాజు విరిచివేసినట్లుగ మేము మణివజ్రకూటము

లతో విస్తరించిన మేరు పర్వతమును అడ్డముగ త్రొక్కు కొనుచు పెక్కుమార్లు దాటితిమి. దేవపురమునను మాకు అడ్డులేదు. యక్షుల, గంధర్వుల గృహములమీదుగ మేము వెళ్ళితిమి. ఆకాశముమీద వెళ్లుచు ఈ చిన్న ఉద్యాన మును దాటలేక పోవుచున్నాము. ఎవ్వరి గొప్ప మాహాత్మ్య బల మిది? ఎవ్వరి సిరి ఇది?" అని ఆశ్చర్యపడుచు ఆగి పోయిరి.

అప్పుడా వనదేవత "ఋషులారా! శాక్యవంశ రాజకుమారుడు ఈ వనమున ధ్యాన చింతాపరుడై యున్నాడు. వందలకొలది పూర్వజన్మములలో కోట్లకొలది గుణములతో ఈ ఋద్ధిని (మాహాత్మ్యమును) సంపాదించెను. ఆ మాహాత్మ్యమే మిమ్ములను వెళ్లనిచ్చుట లేదు." అని వివరించెను.

అప్పుడు ఆ ఋషులు క్రిందకు తొంగిచూచిరి. వారికి సిరితోను, అభ్యుదయముతోను, తేజస్సుతోను, ఋద్ధితోను వెలిగిపోవుచున్న సిద్ధార్థుడు కనిపించెను. "ఈ కుమారుడు ఎవ్వడు? ధనాధిపతియగు వైశ్రవణుడా? కోరికలకు అధిపతి యయిన మారుడా? మహానాగముల ప్రభువైన నాగరాజా? లేకపోయిన వజ్రధరుడగు ఇంద్రుడా? కుంభాండాధిపతియగు రుద్రుడా? మహోత్సాముగల కృష్ణుడా? దేవపుత్రుడగు చంద్రుడు గాని, సహస్రరశ్మియగు సూర్యుడుగాని, చక్ర

క్షత్రియుడగు రాజుగాని, అయి యుండును. శుభలక్షణములు గల బుద్ధుడయినను అయి యుండవలెను.'' అని అనుకొనిరి.

ఆ వనదేవత వారి సందేహమును పోగొట్టుచు, ''వైశ్రవణునియందుగల సిరి (కాంతి), సహస్రాక్షుడగు ఇంద్రునియందున్న సిరి, నలుగురు లోకపాలకులయందున్న సిరి, అసురేంద్రునియందున్న సిరి, మహాపతియగు బ్రహ్మ యందుగల సిరి, కృష్ణునియందున్న సిరి—ఇవన్నియును శాక్యకుమారుని పొందినను ఒక కళనైనను కూర్చలేవు.'' అనెను.

ఆ మాటలు విని ఐదుగురు ఋషులును భూమికి దిగిరి. ధ్యాననిమగ్నుడైన సిద్ధార్థుని చూచిరి. అనింద్యమగు శరీరము ధరించి యొక తేజోరాశి జ్వలించుచున్నట్లు వారికి కానవచ్చెను. వారు సిద్ధార్థుని తనివితీర చూచి స్తుతించిరి. వారిలో ఒక్క ఋషి యిట్లు నుతించెను.

''లోకము క్లేశము లనునగ్నివలన ఘా ర్తిగ తపించిపోగా, ఈ బోధిసత్త్వుడు (సిద్ధార్థుడు) అను సరస్సు ఉద్భవించినది. లోకపు తాపమును అణచివేసి, సంతోషపెట్టు ధర్మమును (గుణమును) ఇది పొందగలదు.''

రెండవఋషి:—''లోకమంతయును అజ్ఞాన మను గాఢాంధకారమున మునిగియుండగా, ప్రకాశవంతమగు

దీపము ప్రాదుర్భవించినది. లోకమునంతయు వెలుగునకు తెచ్చు ధర్మమును ఇది పొందగలదు."

మూడవఋషి:—"శోకసాగరకాంతారమును దాటుటకు యానశ్రేష్ఠము దొరికినది. లోకమును ఆవలియొడ్డునకు చేర్చు ధర్మమును ఇది పొందగలదు."

ఇంకొకఋషి:—"క్లేశము లను త్రాళ్ళతో బంధింపబడినవారి బంధములను తొలగించువాడు ప్రాదుర్భవించినాడు. ఇతడు లోకమునకు క్లేశవిమోచనముచేయు ధర్మమును పొందగలడు."

వేరొకఋషి:—"ముసలితనముచేత, రోగములచేత, బాధపడువారిని ఉద్ధరించుటకు ఉత్తమవైద్యుడు ఉద్భవించినాడు. ఇతడు జననమరణములనుండి విమోచనముచేయు ధర్మమును పొందగలడు."

ఋషులైదుగురును ఈవిధముగ స్తుతించి, ముమ్మారు ప్రదక్షిణముచేసి, ఆకాశమార్గమున వెళ్లిపోయిరి.

శుద్ధోదనమహారాజు కుమారుడు గృహమున కానరాకపోగా మిగుల నాందోళనపడెను. "కుమారుడు కనబడలేదే? ఎక్కడికి వెళ్లెను?" అని పరిజనమును ప్రశ్నించెను. పరిజనము కుమారుని వెదకుటకు నలుదిక్కులకును పరు

గిడెను. వారిలో ఒకరికి ఉద్యానవనమున నేరేడుచెట్టుక్రింద ధ్యానముద్రాంచితుడగు రాజకుమారుడు కనుపించెను. సూర్యగతినిబట్టి చెట్లనీడలు మారినను అతడు కూర్చుండిన నేరేడుచెట్టునీడ మాత్రము కదలకుండెను. దానిని చూచి రాజసేవకుడు పరుగుపరుగున మహారాజునొద్దకు పోయి ఈ సంగతిని నివేదించెను. మహారాజు ఆ చెట్టువద్దకు వచ్చెను. ''ఆహా! ఏమిది? పర్వతశిఖరముమీదనున్న అగ్నివలెను, నక్షత్రగణములలోనున్న చంద్రునివలెను. తేజస్వంతుడై దీపమువలెను వెలుగుచున్న కుమారుని చూచి నా అవయవములు వణకుచున్నవి. నమస్కరింప బుద్ధి పుట్టుచున్నది'' అని మహారాజు మనసులో భావించుకొనెను.

ఇంతలో ఆ కలకలమువలన సిద్ధార్థునకు ధ్యానభంగమయ్యెను. అతడు కనులువిచ్చి తండ్రియగు శుద్ధోదనమహారాజును, పరివారమును చూచి పర్యంకబంధము విడచి లేచెను. తండ్రివెంట పట్టణమును ప్రవేశించెను.

# ౧౦

సిద్ధార్థుని మనస్సు బాల్యమునుండియు వైరాగ్యము నెడలనే మొగ్గు చూపుచుండెను. లౌకిక విషయముల యందణుమాత్రమైన నాసక్తి కానరాకుండెను. ఈ పరిస్థితి శుద్ధోదన మహారాజునకు మిక్కిలి విషాదమును కలిగించెను. మహారాజునకే కాదు. రాజబంధువులకును, రాజోద్యోగులకును, ప్రజలకును గూడ నీ పరిస్థితి మిక్కిలి కలతపాటును కూర్చెను.

శుద్ధోదనున కేమి చేయుటకు దోచలేదు. అతని కేమి చేయుటకును పాలుపోలేదు. అట్టియెడ రాజబంధువులైన శాక్యు లాతనిని సమీపించి "మహారాజా! రాజకుమారుని జనన సమయమున నాతని గ్రహస్థితిని చూచి కార్తాంతికులు పలికిన మాటలు తమకు జ్ఞప్తియందున్నవనియే భావించుచున్నాము. 'ఈ కుమారుడు గృహపరిత్యాగమునైన చేయును; లేదా గృహమున స్థిర నివాసమునైన నేర్పరచుకొనును. అభినిష్క్రమణ మొనర్చినచో తథాగతుడై ఉత్తమ ధర్మప్రచార మొనరించి, లోకము నుద్ధరించును. గృహమును వీడకయే యున్నచో, అశ్వ రత్నాది సప్త రత్నములతోకూడి, చతురంగ బలసమన్వితుడై ధర్మముగ

ప్రజలను రక్షించుచు చక్రవర్తియైన భూమండలము నేలును' అని గదా వారు తెలిపిరి! ఇప్పటి పరిస్థితిని గమనింపగా, రాజకుమారుడు గృహపరిత్యాగము చేయునేమో యను భయము కలుగుచున్నది. అతనికి విద్యా పూర్తియైనది. కళలన్నియును కరతలామలకములై యున్నవి. వివాహమునకు యుక్త వయస్సు కూడ వచ్చినది. కావున, అనురూపయగు కన్యనిచ్చి యుద్వాహ మొనరించినచో మనస్సు మారవచ్చును. ఈ విషయమై ప్రభువు లాలోచింపవలెను'' అని మనవిచేసిరి.

మహారాజునకు వారి యాలోచన చక్కగా నున్నట్లు తోచినది. ''మీ యూహయుక్తముగా నున్నది. సిద్ధార్థున కనురూపయైన కన్య నన్వేషింప వలసియున్నది'' అని యాతడు పలికెను. రాజబంధువులు కొందరు ప్రత్యేకముగా మహారాజును దర్శించి తమ తమ పుత్రికలే యనురూపకన్యలని తెలిపిరి.

శుద్ధోదనునకు వారిమాటలు నచ్చలేదు. ''మనము కుమారునకు నచ్చజెప్పుట సాధ్యముకాని పని. కావున కన్యావరణము నాతనికే వదలుట మేలు'' అని సమాధాన మిచ్చెను. పిదప రాజబంధువులు సిద్ధార్థుని కడకేగి అనురూపయగు తమ కన్యను వివాహమాడ వలెనని కోరిరి.

రాజకుమారునకు సంసారసుఖములయెడల అపేక్ష లేదు. అయినను, వారిమనస్సును నొప్పింప నిచ్ఛగింపని కారణమున "నేటి కేడవదినమున నా నిర్ణయమును తెలుపగల"నని చెప్పి వారిని పంపివేసెను.

పిదప శుద్ధోదనుడు రాజకుమారుని చూచి, తప్పక యనురూప కన్యను పెండ్లాడవలెనని కోరెను. అపారమగు పితృభక్తిగల సిద్ధార్థుడు తండ్రిమాట కెదురాడలేకపోయెను. "తండ్రీ! కన్యావరణ మొక క్లిష్టమైన సమస్య. అనురూపయగు వధువు లభించుట మిక్కిలి దుర్లభము. రాజబంధువులు సూచించిన కన్య లనురూపలు కానట్లు నాకు తోచుచున్నది. కన్యక రూపమునను, కులగోత్రములవలనను అనుకూలురాలై యుండవలెను. ఆమెకు సత్యమునందును, త్యాగమునందును ఆసక్తియుండవలెను. గర్వలోభముల కెడ మీయరాదు. మనోవాక్కాయములచే పరిశుద్ధురాలు కావలెను. అత్తమామలయెడల భక్తియు, దాసదాసీజనముపట్ల అభిమానమును, భర్తయం దనురాగమును ఉండవలెను. ఇట్టి గుణములుగల కన్య గలదేని చూడుడు. ఆమెను తప్పక పరిగ్రహింతును" అని రాజకుమారుడు తెలియజేసెను.

శుద్ధోదనుడు మిక్కిలి సంతోషించి, కుమారుడు కోరిన యుత్తమగుణములుకల కన్యకను వెదకి తెచ్చుటకు

నిశ్చయించి, రాజపురోహితుని పిలిపించి యిట్లుచెప్పెను: "ఓ మహాబ్రాహ్మణా! మీరు కపిలవస్తు మహానగరము నందలి గృహముల నన్నింటిని పరిశీలించి రాజకుమారున కనువైన కన్యకను తెలిసికొనవలెను. మనకు కులగోత్రము లతో పనిలేదు. ఏకులమున పుట్టినదైనను సరే! ఏలయన కుమారునకు గుణములే ప్రధానము."

పురోహితుడు రాజాజ్ఞ ననుసరించి కపిలవస్తు నగరములోని గృహముల నన్నింటిని పరిశీలించెను. అతనికి శాక్యవంశమునకు చెందిన దండపాణి యనునతని గృహములో సర్వలక్షణ లక్షితయైన కన్యకామణి కానవచ్చెను. పురోహితుడా దండపాణి గృహమునకు పోగానే దండపాణి పుత్రిక యాతనికి వినయవిధేయతలతో అతిధి సత్కారము గావించెను. మఱియు నామె యీ పురోహితునివలన నాతని వచ్చిన పనినిగూర్చి తెలిసికొని చిరునవ్వు నవ్వి యూరకుండెను. ఆ బాలిక సుగుణములనుగూర్చి తల్లి యీ భూసురనకు వివరించి తన పుత్రికపేరు "గోప" అనియు తెలిపెను.

రాజపురోహితుడు సంతుష్టహృదయుడై మహారాజు పాలికింబోయి "దేవా! మీరు కోరిన శుభలక్షణములతో గూడిన చిన్నది శాక్య దండపాణి గృహమున నున్నది. ఆపె నిదేవరచిత్తము" అని సర్వమును విన్నవించెను.

శుద్ధోదనుడు కొంచెముసే పాలోచించెను. "మాతృ హృదయము ప్రేమాస్పదమైనది. సాధారణముగా తల్లులు తమ బిడ్డలయెడ లేని గుణములను కూడ కొన్నింటి నారో పించి చెప్పుచుందురు. వధువును నిర్ణయించుకొనుపనిని కుమారున కప్పగించుటయే మే"లని తలచి, నగరములోని కన్యకల నందరిని సిద్ధార్థుడు చూచుటకు తగిన సన్నివేశ మును కూర్పదలచెను. మహారాజు పెక్కు స్వర్ణాభరణము లను, రత్నభూషణములను జేయించి, నేటి కేడవనాడు యువరాజు నగరములోని కన్యల కందరికిని దర్శనమిచ్చు టయే కాక స్వర్ణాలంకారములను, రత్నభూషణములను బహూకరించునని చాటించెను. బహుమానప్రదానసమయ మున యువరాజుదృష్టి యే కన్యపయి ప్రసరించునో కనుగొని చెప్పుటకు తగిన రాజపురుషులను రహస్యముగా నుండునట్లు నియమించెను.

నియమితదినమున నగరములోని సౌందర్యవిలసిత లగు కన్యలందరును యువరాజును దర్శించి పారితోషికము లను గ్రహించుటకు రాజప్రాసాదమునకు వచ్చిరి. ఒక్కొ క్కరును యువరాజునకు ప్రణామమాచరించి, పారితోషిక మును గ్రహించి వెనుకకు పోవుచుండిరి. మహాతేజస్వియగు రాజకుమారుని తేరిపార చూచుటకైనను ఎవ్వరికిని సాధ్య పడలేదు. ఏ కన్యపయిని యువరాజుదృష్టి లగ్నము కాలేదు.

కొంతసేపటికి శాక్యదండపాణి పుత్రికయగు గోప దాసీజనపరివృతయై వచ్చి యువరాజునకు నమస్కరించి రెప్పపాటులేని చూపుతో నాతని సౌందర్యమును గ్రోలుచు నట్లే నిలిచిపోయెను. అప్పటి కాభరణములన్నియు నయిపోయెను. ఆమెకు బహూకరించుటకు యువరాజునొద్ద నేమియు లేకపోయెను.

గోప దరహసితవదనముతో "రాజకుమారా! అందరికిని పారితోషికముల నొసగి, నాకుమాత్ర మీయకున్నావు. ఇది నన్నవమానించుటగా భావింపవచ్చునా?" అని పలికెను.

యువరాజు తత్తరపడుచు "నీ వందరికంటెను వెనుక వచ్చితివి. ఆభరణములా అయిపోయినవి. అందులకై క్షణమాలోచింపవలసివచ్చినది. నిన్నవమానింపవలెనను తలపు నాకెంతమాత్రము లేదు. ఇదిగో! నా రత్నాంగుళీయకము! దీనిని గ్రహింపుము" అని తన వ్రేలినుండి యంగుళీయకమును తీసి యామె కిచ్చెను.

గోప చిరునవ్వునవ్వుచు "యువరాజా! అందరికిని పెద్ద పెద్ద బహుమతుల నిచ్చితివి. నాకు స్వల్పమైన ముద్రిక యొసగబడినది!" అనెను.

సిద్ధార్థుడు కొంచెము చలించి "నీ వట్లనుకొనవద్దు. నేను ధరించిన యాభరణముల నన్నింటిని బహుమతిగా

నిచ్చుచున్నాను. స్వీకరింపుము'' అని తాను ధరించిన విభూషణముల నన్నింటినిదీసి గోప కీయబోయెను.

ఆమెయు కలతపడి ''వద్దు వద్దు. వినోదమున కిట్లంటిని. యువరాజును భూషణవిహీనునిగా చేయవలెనను తలంపు నాకు లేదు. ఈయంగుళీయకమే చాలును. ఇదియే పదివేలు'' అని పలుకుచు, సాభిప్రాయముగ నాతనివైపే చూచుచు వెడచిపోయను.

సిద్ధార్థుడును క్షణమాత్ర మామెపైనే చూపు నిలిపి, నిస్తబ్ధుడై నిలిచెను.

## ౧౧

మహారాజనియుక్తులగు రాజపురుషులు వీరి సంభాషణలను వినిరి; వీరి హావభావములను పరికించిరి. వారు శుద్ధోదనునియొద్దకు పోయి యీ వృత్తాంతము నెరిగించిరి.

మహారాజు వెంటనే రాజపురోహితుని శాక్యదండపాణివద్దకు పంపెను. యువరాజునకు కన్యారత్నమగు గోపనిచ్చి వివాహము చేయవలెనను శుద్ధోదనుని కోరికను పురోహితుడు దండపాణి కెరిగించెను.

దండపాణి వెంటనే యేమియు ప్రత్యుత్తర మీయలేదు. ఆయనమనస్సు సందిగ్ధావస్థలో పడెను. మహారాజు కోరికను తిరస్కరించుటయా? లేక కులనియమము నతిక్రమించుటయా? అనునదే అతని ఆలోచన. కళాకుశలుడు, శిల్పజ్ఞుడునైనవానికే కన్య నీయవలెనని కులధర్మము. రాజకుమారుడు నవనీతహృదయుడు; అంతఃపురమును విడువక, అచ్చటనే పెరిగి, పెద్దయైనాడు. అతడు శిల్పకుశలుడని, కళాభిజ్ఞుడని ఎవ్వరును తలంపలేదు. ఆయుధపరిశ్రమ మొనర్చు శాక్యకుమారులతో ఎన్నడును కలసిమెలసి యున్నట్లు తోచదు. అట్టి కళానభిజ్ఞునకు తన పుత్రిక నిచ్చుటెట్లు? లేక మహారాజుకోరికను తిరస్కరించుటెట్లు?

. శాక్యదండపాణి కొంచెముసేపాలోచించి, మహారాజేమనుకొన్నను సరే, కులధర్మము నతిక్రమింపరాదని నిశ్చయించుకొని తన సంకల్పమును పురోహితున కెరిగించెను. పురోహితుడు ప్రభువునకు శాక్యదండపాణి మాటలను తెల్పెను.

శుద్ధోదనుడు విషాదముతో క్రుంగిపోయెను.

ఏ విషయమునను లోపము లేకున్నను, శుద్ధోదను నిదివరకొక సంఘటన మిక్కిలి బాధించుచుండెను. శాక్య వంశములోని రాజకుమారులు ఎక్కురున్నను, వారెవ్వరును సిద్ధార్థునితో కలిసిమెలసి యుండలేదు. ప్రతివిషయమునందును స్వాతంత్ర్యాభిప్రాయమునే ప్రదర్శించుచుండును. యువరాజేకాకిగనే యుండవలసివచ్చెను. ఇయ్యది మహారాజున కెంతో కష్టముగా నుండెను. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు శాక్యదండపాణి తిరస్కారము దానికి తోడయ్యెను.

తండ్రి విచారగ్రస్తుడై యుండుటను సిద్ధార్థుడు గుర్తించి, యా విచారమునకు కారణమును గూడ గ్రహించెను. యువరాజు తండ్రిదగ్గరకు పోయి "తండ్రీ! మీరు విచారింపవలదు. నాకన్ని కళలయందును ప్రావీణ్యము కలదు. శిల్పమునందు సామర్థ్యము గలదు. శిల్ప, కళలలో ఈ నగరమున నెవ్వరును నాకు సాటికారని గట్టిగా చెప్పగలను. ఈవిషయమున మీరు సందేహింపనక్కరలేదు. సమస్తశిల్ప

జ్ఞులను రప్పించి, వారి సమక్షమున శిల్పప్రదర్శనమున కేర్పాటు కావింపుడు. నా సామర్థ్యమును చూపి జనులందరి మెప్పును పడయగలను'' అని విన్నవించెను.

శుద్ధోదనుడు కుమారుని మాటలకు మిక్కిలి సంతోషించి నాటికి సప్తమ దివసమున శిల్పవిద్యా ప్రదర్శనము జరుగుసనియు, యువకులగు శిల్పజ్ఞులందరును అందు పాల్గొనవలెననియు చాటించెను. శిల్పివిద్యలో సర్వోత్తముసే శాక్యదండపాణి పుత్రికయగు గోప వరించునట్లు నియమమేర్పరుపబడెను. సర్వశిల్పజ్ఞులును ఆ ప్రదర్శనమున కాహ్వానింపబడిరి.

ప్రదర్శనదినమున, గమ్యస్థానమునకు యువరాజును దీసికొని పోవుటకయి శ్వేతగజమొక్కటి రాజభవనమునకు వచ్చుచుండెను. దానిని శాక్యదేవదత్తుడు నగర ద్వారము కడనే చూచి మిక్కిలి యసూయపడెను. అంతేకాక, శాక్యులందరును తనపక్షమున నున్నారను బలగర్వమున, తన యెడమచేతితో నా యేనుగు తొండమును పట్టుకొని, కుడి చేతితో దాని చెంపపై గట్టిగా నొక దెబ్బకొట్టెను. వెంటనే యాగజము మరణించెను. బలగర్వియగు దేవదత్తు డాచోటి నుండి వెళ్ళిపోయెను. ఏను గచ్చటనే పడియుండెను.

మరి కొంచెముసేపటికి నందకుమారు డచటికి వచ్చి ''ఈగజము నిట్లు చంపినవా రెవ్వరు?'' అని యచటివారిని

ప్రశ్నించెను. "దేవదత్తు"డని వారు తెలిపిరి. "దేవదత్తు డ గజము నిచ్చటనే యుంచివేసిపోవుట బాగు లే"దని, దానిని తన చేసితో లాగి కొంచెము దూరముగా పడవేసి వెళ్ళి పోయెను.

తరువాత సిద్ధార్థుడు రథారూఢుడై శిల్పప్రదర్శన రంగమునకు పోవుచు నగరద్వారమునకు కొలదిదూరములో పడియున్న శ్వేతగజమునుచూచి "దీనింజంపి యీరీతిని పడ వేసినవా రెవ్వరు?" అని యక్కడ నున్నవారిని ప్రశ్నించెను. దానిని దేవదత్తుడు నగరద్వారముకడ వధించెననియు, నంద కుమారుడు ద్వారముకడ నడ్డముగానున్న యా హస్తిని దూరముగా పడవేసెననియు వారు తెలియజేసిరి.

"దేవదత్తుడు నిష్కారణముగా నీ గజమునుచంపుట బాగు లేదు. నందకుమారుడు నగరద్వారమున పడియున్న యీ ప్రాణిని కొంచెము దూరముగా పడవేయుట కొంత మేలే! అయినను, దీని నిక్కడనే యుంచినయెడల పరిసర ప్రదేశములన్నియు దుర్గంధపూరితములగును" అని పలికి సిద్ధార్థుడు తన కాలి బొటనవ్రేలితో నా గజము నెత్తి పట్టు కొని రథారూఢుడై సప్త ప్రాకారములను, సప్త పరిఖలను దాటి నగరమునకొక క్రోశముదూరమున దానిని పడవేసెను. ఆ యేనుగుపడినచోట నొక పెద్ద గొయ్యి యేర్పడెను. అది హస్తిగర్తమని ప్రసిద్ధిపొందెను.

సిద్ధార్థుడు శిల్ప ప్రదర్శన రంగమునకు వచ్చెను. తక్కిన శాక్యకుమారు లందరును తమ తమ శిల్ప ప్రదర్శనమున కాయత్తులై వచ్చిరి. ఆ ప్రదేశము రాజబంధువుల తోను, పురజనులతో క్రిక్కిరిసి యుండెను. పరీక్ష సర్వ కళలయందును జరుగవలసి యున్నది.

తొలుత లిపిజ్ఞానమున పరీక్ష జరిగెను. సర్వలిపిజ్ఞుడగు విశ్వామిత్రుడు మధ్యవర్తిగా నిర్ణయింప బడెను. అందు సిద్ధార్థుడే మొదటి యభ్యర్థి.

విశ్వామిత్రుడు సిద్ధార్థుని లిపిజ్ఞతను బాగుగా నెఱుగును. రాజకుమారుని లిపివిషయమున పరీక్షించుటకు తన కర్హత లేదనుచు అతడిట్లనెను:—"ఓ మహాజనులారా! మనుష్యలోకమున గాని, తదితర లోకములందు గాని ఎన్నెన్ని లిపులు కలవో వానియన్నింటను యువరాజు సమర్థుడు. ఇతడెరిగిన లిపులపేర్లు మీకే కాదు; నాకును తెలియవు. నా ప్రత్యక్షానుభవమును బట్టి తెలుపుచున్నాను. లిపిజ్ఞానమున యువరాజును మించినవారు లేరని నా యభిప్రాయము."

విశ్వామిత్రుని పల్కుల కెవ్వరు నెదురాడలేక పోయిరి. అప్పుడు శాక్యులలో నొకడు "సరియే! సిద్ధార్థుడు లిపిజ్ఞానములో దిట్ట కావచ్చును. సంఖ్యా గణనమున సిద్ధార్థునికూడ పరీక్షింపవలసినదే!" అనెను. అర్జునుడను శాక్య

గణకుడు తీర్పరిగా నిర్ణయింపబడెను. గణనమున సిద్ధార్థుడు శాక్యులందరి నోడించి, తన యసాధారణ ప్రజ్ఞను వెల్లడించెను. పరీక్షకుడగు నర్జునుడే మిక్కిలి యచ్చెరువొంది యువరాజును ప్రశంసించెను. పిదప అర్జునునకును, సిద్ధార్థునకును జరిగిన సంఖ్యాగణన ప్రసంగములో అర్జునునకు దెలియని పెక్కు విషయములను యువరాజు వెల్లడించి యాతనిని సమ్మోహితు నొనరించెను.

పిదప లంఘనముననుు, పరుగునందును రాజకుమారునకును, మిగిలిన శాక్య రాజపుత్రులకును పోటీ జరిగెను. వానియందును సిద్ధార్థుడే సర్వోత్కృష్టుడని యందరిచేతను ఆమోదింపబడెను.

పిదప మల్లయుద్ధములో పోటీ జరిగెను. శాక్య కుమారులలో ఒకరి వెంబడి నొకరు సిద్ధార్థునితో తలపడి పరాజితులు కానాగిరి. వారి కాతనిపయి అసూయ జనించెను. అప్పుడు ధీరుడగు సిద్ధార్థుడు వారింజూచి "మీరు పరాజితులగు చున్నందులకు విచారింపవద్దు. ఇంతవరకు మీలో నొక్కరొక్కరే నాతో యుద్ధ మొనర్చుటవలన పరాజయము కలిగి యుండవచ్చునని మీయూహ. మీరందరును ఒక్కుమ్మడిగా నాపైకి రండు. మీరందరు సమష్టిగా నన్నోడించినను, నేను పరాజితుడనైన ట్లంగీకరింతును" అని పలికెను.

ఇదియే తగిన తరుణమని యెంచి శాక్య కుమారు

లందఱు నొక్కపెట్టున సిద్ధార్థునిపయి బడిరి. అయినను వారందరిని యువరాజు క్షణములోనే పరాజితుల నొనర్చి ప్రేక్షకులను విస్మయమున ముంచెను.

శాక్య దండపాణి శాక్య యువకుల యశక్తతకు లోలోన సవ్వుకొనుచు, సిద్ధార్థుని తనమనస్సునందే యభినందించుచు నా యువకులతో నిటనెను - "కుమారులారా! ఇవి యన్నియు ప్రధానములు కావు. ముఖ్యమైన ధనుర్విద్యా ప్రదర్శన మున్నది. అందు మీ మీ శక్తి సామర్థ్యములను జూపి విజయులు కండు."

శాక్యరాజకుమారులు వల్లెయని విలువిద్యలో తమ నేర్పుచూప యత్నించిరి. ఆనందుడు రెండుక్రోశముల దూరమున నున్న లక్ష్యమును భేదించెను. దేవదత్తుడు నాల్గు క్రోశముల దూరమునగల లక్ష్యమును భేదించెను. సుందరనందు డారు క్రోశముల దూరమునగల లక్ష్యమును భేదించెను. దండపాణి రెండుయోజనముల దూరమునగల లక్ష్యమును భేదించెను. వారి బాణప్రయోగ మింతకంటె ఎక్కువ దూరము సాగలేదు.

పిదప సిద్ధార్థునివంతు వచ్చెను. అతనికయి పదిక్రోశముల దూరమున నొకలక్ష్య ముంచబడెను. దాని కావల సప్తతాళములును, వానివెనుక లోహనిర్మితమగు వరాహవిగ్రహము నుండినవి. సిద్ధార్థుడింతదూరము బాణప్రయోగ

మొనరింపగలడా! అని పెక్కుమంది సందేహించిరి. ఇందు తప్పక యువరాజున కోటమి కలుగునని శాక్యకుమారులు భావించిరి. సిద్ధార్థుడు క్షణమాత్రి మాలోచించి, తన శాణ ప్రయోగమునకు సామాన్యమగు ధనుస్సు తగదని నిశ్చ యించి తండ్రియొద్దకు పోయి "దేవా! నాకు తగిన విల్లు కావ లసియున్నది. సాధారణమైనవి నిరుపయోగమైనవి. గొప్ప విల్లేదయిన కలదా?" అని ప్రశ్నించెను.

అప్పుడు శుద్ధోదనుడు "నాయనా! లేకేమి? ఉన్నది. నీ పితామహుడగు సింహహనువు విల్లు లోకోత్తరమైనది. దాని నితరు లెవ్వరును ఎక్కుడలేరు. అందువలన నొక్కచో నుంచి గంధమాల్యాదులతో పూజించుచున్నాము. ఇదిగో! దాని నిప్పుడే తెప్పించెదను" అని పలికి వెంటనే దానిని తెప్పించెను.

ఆ విల్లన్యుల కెక్కుడరానిదని మహారాజు పలుకుట వలన, కొంత పౌరుషముతో శాక్యరాజకుమారులు దాని నెక్కుడుటకు యత్నించిరి. కాని, యెవ్వరికిని సాధ్యము కాక పోయెను. సిద్ధార్థుడు దానిని సులభముగా నెక్కుడగల్గెను. అతడు దాని నెక్కుపెట్టి బాణమును సంధించెను. అది పది క్రోశములదూరముననున్న లక్ష్యమును భేదించుటయే కాక సప్తతాళములను పడగొట్టి, యావెనుక ఆయస వరాహ ప్రతిమను భేదించి భూమిలో ప్రవేశించెను. అది భూమిలో

ప్రవేశించిన స్థలమున నొక కూప మేర్పడెను. అయ్యది శర కూపమని ప్రసిద్ధికెక్కెను. రాజకుమారుని యీ ధనుర్విద్యా కౌశలము జనులందరికిని ఆశ్చర్యమును కలిగించెను.

పిదప అశ్వారోహ గజారోహములందును, బాహు వ్యాయామమునను, శౌర్యమునందును, ధైర్యమునను, సారథ్యమునను, చిత్రలేఖన వీణావాదనాదులందును జరిగిన పరీక్షలలో యువరాజే యందరికన్నను మిన్నగా నిర్ణయింపబడెను. శుద్ధోదనుని యానందమునకు మేరలేకపోయెను. ప్రజల యానందకోలాహలము మిన్నుముట్టెను.

పరీక్ష ముగిసెను. దానితోపాటు శిల్పప్రదర్శనము ముగిసెను. శాక్యకుమారుల ముఖములు పరాజయపరిభవమున వెలవెలపోయెను. విజయమును పొందిన సిద్ధార్థుడెట్టి భావమును వ్యక్తముచేయక నిశ్చలుడై తన యాసనమున [illegible]ష్ట[illegible]య్యెను.

అంత శాక్యదండపాణి తన పుత్రిక గోపను తీసికొని వచ్చి, మహారాజు సమక్షమున నిలిపి యిట్లనెను:

''మహారాజా! శిల్పశుల్కయగు నా పుత్రిక ఇదిగో! ఈమెను మీకోడలిగా గ్రహింపవలెనని ప్రార్థించుచున్నాను. తొలుత మీ కోరికను గౌరవింపకపోవుటకు కారణము లేకపోలేదు. మహారాజు దయను కోరి దండపాణి కులధర్మము

నతిక్రమించెనను అపకీర్తిని బాపుకొనుట కట్లు చేయవలసి వచ్చెను. ఈ మా నియమమువలన యువరాజు శిల్పకళా నైపుణ్యము వెల్లడియై, యాతనికీర్తి లోకమెల్లెడల వ్యాపించెను. ఇది యెల్లవిధముల మేలే చేకూర్చెను. నా పుత్రిక యన్నివిధములను యువరాజున కనురూపయని నానమ్మకము''

గోప మామగారికి నమస్కరించి, ఆయన వాత్సల్యమునకు పాత్రురాలయ్యెను.

పిదప గోపా సిద్ధార్థులకు మహావైభవమున నుద్వాహము జరిగెను. నవవధువు భర్తయెడల గాఢానురాగమును, అత్తమామలయెడ భక్తిగౌరవములను, రాజబంధువులయెడ నభిమానమును, దాసదాసీజనులయెడ నపారకరుణను చూపుచు తోడియువతులకు తలమానికమై మెలగుచుండెను.

## ౧౨

యువరాజగు సిద్ధార్థుడు తన మనస్సున కనుసరించి ప్రవర్తించు ననుకూలవతియగు భార్యతో సుఖముగా కాలమును గడపుచుండెను. ఇట్లు కొంత కాలము గడచెను. మనస్సున వైరాగ్యము సన్నగిల్లెను.

ఈ పరిస్థితినిగాంచి దేవనాగయక్ష గరుడగంధర్వ కిన్నరాదులు మిక్కిలి కలతజెందిరి. దుఃఖభూయిష్ఠమైన లోకము నుద్ధరించుట కవతరించిన మహాపురుషుడు సిద్ధార్థుడు! అతడు లోకహితార్థము గృహమునుండి అభినిష్క్రమణము చేయవలసియున్నది. అభినిష్క్రమణ మొనర్పనియెడల అత డవతరించుట నిష్ప్రయోజనమగును. ధర్మప్రచారము జరుగదు. ధర్మము లోపించును.

దేవనాగయక్షాదులు బోధిసత్త్వుని సమీపించి ప్రాంజలులై నమస్కరించుచు, ఉత్తమోత్తముడును, శుద్ధసత్త్వుడును అగు రాజకుమారు డెప్పుడు గృహమును విడిచి ధర్మప్రచారమునకు బోవునోయని యెదురు చూచుచుండిరి.

దినములు గడచుచునే యుండెను. సిద్ధార్థునిలో మార్పు కానరాలేదు. అతడు గృహమునుండి అభినిష్క్రమణ

మొనర్చి మహాద్రుమ రాజమూలమున నుపవిష్టుడై. ససైన్యుడగుమారుని బెదరించి తరిమి లోకోత్తరమగు సమ్యక్సంబోధిని పొందుననియు, పది విధములగు తథాగత బలములతో కూడుకొని, లోకోత్తరమును, ద్వాదశార యుక్తమునగు ధర్మచక్రమును ప్రవర్తింప జేయుననియు, ముల్లోకములవారికిని సంతోషమును కలిగించుననియు దేవపుత్రులు తలచుచుండిరి. ఈ విషయమున నాతనిని హెచ్చరించుటకు వారు సంకల్పించిరి. కొందరు మారువేసములతో రాజాంతఃపురమున ప్రవేశించి. వైరాగ్యమును ప్రబోధించుచు, ధర్మములను ప్రతిపాదించు గీతములను పాడదొడగిరి. మధురములు, మనోజ్ఞములునగు వేణు, వీణాతూర్యాది ధ్వనులచే నతని మనస్సున కానందమును కలిగించి, ఆతనిని తమవైపు త్రిప్పుకొనన జూచుచుండిరి.

అంతఃపురమున వినబడు గీతములయందును, వేణువీణాది వాద్యముల ధ్వనులయందును అతనికి ధర్మబోధయే వినబడుచుండెను. ఆధ్వనులు అతనిని ఇట్లు ప్రబోధించుచున్నట్లు తోచుచుండెను.

"ఓ వీరుడా, నీవు వెనుకటి సంగతులను స్మరణకు తెచ్చుకొనుము. నీవు జగత్తునకు హితమును కలిగించుటకే అవతరించితివి. నీవు పూర్వము లోకోద్ధరణమునకై వివిధ సంపదలను వదలిపెట్టితివి. శిరస్సు, కరచరణములు మొద

లయిన అవయవములను గూడ దానమిచ్చితివి. నీ శీలము శుభవిమలమయినది. పూర్వమును నీ శీల మిట్టిదియే! మైత్రిని, కారుణ్యమును, ముదితను, ఉపేక్షను అలవరచు కొని, ఇదివరకు ప్రవర్తించినట్లే ఇప్పుడును ప్రవర్తింపుము.

“పూర్వము నీవు నృపకుమారుడుగ జన్మించినప్పుడు ఒక నరుడు వచ్చి, ‘నగర నిగమ పూర్ణమయిన ఈ మహీ మండలమును నాకు దానముచేయుము’ అని కోరెను. అప్పుడు నీవు సకల మహీవలయమును వదలిపెట్టితివి. అప్పు డును నీ మనస్సు ప్రమోదించెనే కాని, ప్రక్షోభింప లేదు.

“నీవు బ్రాహ్మణుడవుగ అవతరించిన జన్మలో గురు జనులకు పరిచర్య చేసితివి. ఎవరికిని ద్రోహము చేయలేదు. నీవు ఋషిగ నున్న జన్మలో కలియను నృపతి నీ కరచరణ ములను నరకివేసెను. అయినను నీవు నీ కులక్రమాగతమగు ధర్మమునే ఆచరించితివి గాని, మనః క్లేశము చెందలేదు. నరకిన నీ కరచరణములనుండి పాలు కారెనే కాని రక్తము కారలేదు.

“నీవు పూర్వము తపస్వివై జన్మించినప్పుడు ఒక్క గిరివరగుహలో నివసించుచు తపమాచరించు చుంటివి. అప్పుడొక రాజు నిన్ను విషలిప్తమగు బాణముతో కొట్టెను. ఆ రాజునెడ నీవు కృపయే కనుబరచితి కాని కోపము గను బరచలేదు.

"నీవు పూర్వము ఒకానొకజన్మమున మృగపతిగ నుంటివి. అప్పుడు గిరినదీజలప్రవాహమున ఒక మానవుడు పడిపోయి కొట్టుకొనిపోవుచుండెను. నీవు అతనిని ఒడ్డెక్కించి కాపాడితివి. అతడు నీకు శత్రువయ్యెను. అయినను నీవు కలతపడలేదు.

"నీవు ఒకప్పుడు వణిక్పుత్రుడుగ పుట్టినప్పుడు ఎంతయో శ్రమమున సంపాదించిన చింతామణి విపులాగాధసముద్రమున పడిపోయెను. అప్పుడు నీవు సముద్రమును శోషింపజేసి. ఆ ధనమణిని మరల సంపాదించితివి. నీవు ఎంతయో బలము కలవాడవు: వృషభసమానుడవు.

"నీవు పూర్వము ఋషిపుంగవుడవుగా పుట్టినప్పుడు ఒకడు నీవద్దకు వచ్చి 'నాకు శరణు ఇండు. నన్ను శత్రువు వెంటాడుచున్నాడు' అని ప్రార్థించెను. అప్పుడు నీవు అతని కొరకై శరీరమును త్యజించితివేకాని అతనిని త్యజింపలేదు.

"పూర్వము నీవు ఒక ద్రుమతలమున తపస్సుచేయుచున్నప్పుడు ఒక ఋషి వచ్చి, నీచెట్టున ఎన్ని చివుళ్లున్నవో చెప్పుమనెను. నీవు చెప్పితివి తరువాత ఆ ఋషి వానిని లెక్కపెట్టెను. నీవు చెప్పినది సరియగు లెక్కయాయెను. ఆ ఋషి మిగుల ఆశ్చర్యపడెను. అప్పుడు నీవు అవితథవాక్కు, సమవాక్కు అయితివి.

"ఉత్తమగుణవంతుడా, నీవు ఒక జన్మలో చిలుకవై ఒక వృక్షమును ఆశ్రయించి యుంటివి. ఆ వృక్షము క్షీణించి పోయినను, నీవుమాత్రము దానిని వదలలేదు. దీనిని గుర్తించి ఇంద్రుడు నిన్ను మెచ్చుకొనెను. అతనివలన ఆ వృక్షమునకే మేలు కలిగించితివి.

"నీవు ఒక జన్మమున శశికేతు డనువాడవు. మఱియొక జన్మమున దంష్ట్రి డనువాడవు. కరుణామానసుడగు మణిచూడు డనువాడుగను, చంద్రప్రదీపు డనురాజుగను జన్మించి, మహాశూరుడవుగ పేరుపొంది, దానవినీతుడవైతివి.

"నీవు ఒకప్పుడు సుందరగజముగ అవతరించితివి. అప్పు డొక వ్యాధుడు నీ చక్కని దంతములకై నిన్ను బాణములతో కొట్టెను. అతనిపై కోపము చూపక ఎంతయో దయతో నీ దంతములు అతనికి ఇచ్చితివి.

"నీవు మరొక పుట్టువులో భల్లూకముగా ఉన్నప్పుడు చంద్రునిమంచుకిరణములనే జలముగ గ్రహించుచుంటివి. ఒక మనుష్యుడు నిన్నుచూచి భయపడగా వాని భయము పోగొట్టి పరిచర్యచేసితివి; వివిధకందమూలఫలముల నిచ్చి అతనిని సంతోషపెట్టితివి. తుదకు అతడు నిన్ను చంపుటకు యత్నించెను. నీవు శాంతితో అతనిని క్షమించితివి.

"నీవు ఇంకొక జన్మమున బంగారుచాయగల అశ్వముగా పుట్టితివి. అప్పుడు ఆకాశమున రాక్షసద్వీపమునకు

పోయితివి. అక్కడ చెరలో నున్న మనుష్యుల చెరతప్పించి క్షేమము కలిగించితివి.

"నీవు ఒక జన్మలో మహర్షివై ధ్యానములో నిమగ్నుడవై యుంటివి. జనులు తగినరాజులేక అటమటించుచు నిన్ను ప్రార్థించి రాజ్యమున అభిషేకించిరి. నీవు వారికి తండ్రివలె కుశలములు కలిగించి, వారిని బ్రహ్మపథమున నడపించితివి.

"నీవు ఒకజన్మమున అదీన పుణ్యుడవను రాజుగ నుంటివి. బ్రహ్మదత్తుడవుగను, ధర్మచింతుడవుగను జన్మించి పెక్కు త్యాగములు చేసితివి."

రాజకుమారుడైన సిద్ధార్థుడునివసించుచున్న భవనము సమస్తగృహోపకరణములతో సమృద్ధమై యుండెను. మనస్సునకు నచ్చినట్లు విహరించుటకు అనుకూలముగ నుండెను. అది దేవతలనగరమువలె ప్రకాశించుచుండెను. వివిధ ద్వారములు, తోరణములు, గవాక్షములు వివిధ రత్నములతోను, ఎత్తైన ఛత్రములతోను, చిరుగంటలతోను, రంగు రంగుల ధ్వజములతోను అలంకరింపబడియుండెను. వానికి పట్టు వస్త్రముల మాలికలు, ముత్తెముల హారములు వ్రేలాడగట్టియుండిరి. భవనము ప్రతిమూలయందును ఘటములలో ధూపములు గుబాళించుచుండెను. మంచువలె తెల్లనయిన వస్త్రముల చాందినీలు కట్టబడియుండెను.

భవన ప్రాంగణమందలి ఉపవనమున అన్ని ఋతువుల యందును పుష్పించు పూవులు క్రిందరాలి పరిమళించు చుండెను. అల్లిబిల్లిగా నల్లుకొనిన తామరలతో నిండిన కొలకు లుండెను. చెట్ల ఆకులలో కలసిపోయిన చిలుకలు, గోరువంకలు, హంసలు, కోకిలలు, నెమళ్లు చక్రవాకములు, కువాలములు (కాటుకపిట్టలు) పిచ్చుకలు, వెన్నెలపిట్టలు, మధురముగ ధ్వనిచేయుచుండెను. అక్కడి నేలలు నీల వైదూర్యములతో మిలమిల మెరయుచుండెను. వానిపై నడచువారి ప్రతిబింబములు వానిలో ప్రతిఫలించుచుండెను. ఆ భవనము అందమును ఎంత చూచినను తనివితీరదు.

సిద్ధార్థుడు పరిశుద్ధములు, నిర్మలములు అయిన అవయవములు కలవాడు. అతడు ముక్తామాల్యాభరణములు ధరించియుండెను. శరీరమునిండుగ పరిమళ లేపము అలదుకొనియుండెను. పరిశుభ్రములైన ధవళవస్త్రములు ధరించియుండెను. శిరీషపుష్పమువంటి సుఖస్పర్శగలిగి మిగుల సున్నితములైన వస్త్రములు పరచిన పసిడిపడకపై శయనించుచుండెను. చక్కని అంతఃపుర మధ్యమున అతడు నిద్రించుచు, శంఖము, భేరి, మృదంగము, పణవము, తుణవము, వీణ, వల్లకి, సంతాడకి మొదలయిన వాని మధుర ధ్వనులు, తూర్యధ్వనులు, సంగీతము వినుచు మేల్కొనుచుండెను. ఈ ధ్వనులలోను దేవపుత్రుల ప్రభావమువలన

విరాగప్రబోధముతో వినవచ్చుచుండెను. మరియొకప్పుడిట్లు వినబడెను :

"ఓ రాజకుమారా! ఈ త్రిభువనము జరావ్యాధి దుఃఖములతో కుమిలిపోవుచున్నది; మరణాగ్నితో మండిపోవుచు అనాథగా నున్నది. ఈ జగత్తులోని మానవులు సంసారమునుండి విడివడలేక మూఢులై కొట్టుమిట్టాడుచున్నారు. కుండలో పడిన తుమ్మెద కుండలోనే తిరుగాడుచున్నట్లు మూఢమైన లోకము ఈ సంసారములోనే తిరుగుచుండును.

"ఈ భువనము స్థిరమైనదికాదు. శరత్కాలములోని మేఘమువంటిది. దుఃఖమోహాభరితమైన ఈ జగత్తు నటులతో కూడిన రంగస్థలమువంటిది. ఈ జగమున ఆయుస్సు ఆకాశములోని మెరపువలె, పర్వతశిఖరమునుండి పడు సెలయేటివలె మహావేగమున సాగిపోవును.

"మండుచున్న నిప్పుగుండము ఎట్లు భయము కలిగించునో, కోరికలును అట్టివే. అంతేకాదు. ఇవి మహాపంకసమానమైనవి; అసిధారతో సమానమైనవి; సామాన్యమగు అసిధార కాదిది; తేనెపూసిన అసిధార. కోరికలు కుక్కనోటి యెముకవంటివి. నీటిలోని చంద్రునివంటివి. కొండలలో కలుగు ప్రతిధ్వనులవంటివి. స్వప్నములవంటివి. ఎండ

మావులవంటివి. గాలిపోగులవంటివి. నీటిబుడగలతోను, నురుగుతోను సమానమైనవి. నిరుపయోగమైనవి.

"ఈ శరీరము ప్రథమవయస్సులో చక్కని రూపముతో నుండును. బాల్యమున ప్రియముగ కానవచ్చును. ముసలితనము, వ్యాధివలన దుఃఖము సంభవించినప్పుడు శరీరములోని తేజస్సంతయు నశించును. అట్టి దేహమును ఎండిపోయిన నదిని జనులు వదలినట్లు వదలుదురు.

"చిన్నప్పుడు వ్యక్తి ప్రియముగను, ఇష్టముగను ఉండును. ధనధాన్యములతో తులతూగుచు బలవంతుడుగ నుండును. ఆ ధనమంతయు నశించి చిక్కులలో పడినప్పుడు శూన్యమగు నడవిని విడచివెళ్ళినట్లు అందరును విడచి వెళ్ళుదురు.

"మనుష్యుడు దానములు చేయునప్పుడు పూవులు పూచిన చెట్లవలెను, పండ్లనిచ్చు చెట్లవలెను, అందరికిని ప్రీతిపాత్రుడై యుండును. అతడు ధనహీనుడై వార్ధక్యము వలన బాధపడుచు ఇతరులను యాచించు స్థితికలిగినప్పుడు గ్రద్దవలె అందరికిని అప్రియ మైనవాడగును."

"వయస్సు అతిక్రమించిన మానవుడు ముసలితనము వలన బాధపడుచున్నప్పుడు పిడుగుపడి వికారముగ నయిన ప్రానువలె కనబడును. ముసలితనము జీర్ణగృహామువంటిది. అది భయంకరమైనది. మానవులను ముసలితనము మాలు

లత మద్దిమానుల వనమును శుష్కింపజేసినట్లు శుష్కింపజేయును. ముసలితనము బలపరాక్రమములను, వేగమును హరింపజేయును. బురదయందు కూరుకొనిపోయిన మానవుడు బయటికి రాలేనట్లే, ముసలితనము వచ్చినవాడును బయటపడలేడు. ముసలితనము వచ్చినచో చక్కనిరూపము వికారమైనదిగ మారిపోవును. అది తేజమును నశింపజేయును. సౌఖ్యమును పోగొట్టి పరిభవమును కలిగించును. కాంతిని హరించి మరణమును కలిగించును.

"శిశిరఋతువున ఎక్కువగ కురియు మంచు తరుగుల్మముల, లతల, ఓషధుల, ఓజస్సును నశింపజేయును. అట్లే రోగములు, ముదిమి కాంతిని నశింపజేయును. జరావ్యాధులు ధనధాన్యములను, సంపదను నశింపజేయును. అవి మిక్కిలి పరితాపమును కలిగించును. అవి ప్రాణులను చంపివేయును. ఇష్టులకు విరోధము కలిగించును. సూర్యుడు ఆకాశమున ఎక్కువ తాపమును కలిగించినట్లు తాపము కలిగించును.

"మరణము పతనమును కలిగించును. ఇష్టులనుండి, ద్రవ్యమునుండి, ఇతరులనుండి శాశ్వతముగు వియోగము కలిగించును. మరణించినవాడు తిరిగిరానేరాడు. నదీతీరమున చెట్ల ఆకులు రాలిపడినచో నదీప్రవాహములో కొట్టుకొనిపోవును. అట్లే మరణము మానవులను ఈ లోకమునుండి ఈడ్చుకొనిపోవును."

"మరణము మానవుల వశిత్వమును పోకార్చును. దానికి అందరును లొంగిపోవలెను. నదిలో పడిన దారువు కొట్టుకొనిపోయినట్లు మరణము ఈడ్చుకొనిపోవును. నిస్సహాయుడగు మానవుడు దానికి లొంగి ఒంటరిగనే పోవును. అతడు తన కర్మఫలమునకు తగినట్లు దానికి వశుడై పోవును. జలములోనున్న మొసలి ప్రాణులను లాగుకొనిపోవును. గరుడుడు పామును తన్నుకొనిపోవును. మృగరాజు ఏనుగును సంహరించును. అగ్ని తృణమును, ఓషధీవర్గమును, ప్రాణి సమూహమును కాల్చివేయును. అట్లే మరణము ప్రాణి సమూహమును మ్రింగవేయును."

మరొక ప్రాతః కాలమున సిద్ధార్థుడు మేల్కొనునప్పుడు నాకగణము పాడు గీతములనుండి విచిత్రమగు గాథలు బయలువెడలి అతనికి ఆశ్చర్యము కలిగించెను:

"ఆకాశములో విద్యుత్తు కొంచెముసేపే ఉండి మరల మరుగై పోయినట్లు ఈ సకల సంసారము మరల నశించునట్టిదే. ఈ జగత్తులు అనిత్యములు; అధ్రువములు; పచ్చి కుండలవలె త్వరలో పగుళ్ళువారును. వడగండ్లతో కట్టబడినట్టివి. ఇసుకలో నిర్మించిన నగరములవంటివి.

"ఆశపట్టుట ఈ జగత్తు ప్రధానలక్షణము. ఈ జగత్తు వర్షాకాలమున చెదరిపోయిన లేపనము (రంగు) వంటిది; నదుల ఇసుకగట్లవలె కూలిపోవునట్టిది; సంసార

మనునది ప్రదీపకాంతులవలె త్వరలో పుట్టి వ్యాపించునట్టిది; అనవస్థితమైన గాలివంటిది; నురుగుముద్దవలె అసారమైనది; దుర్బలమైనది. అరటి బోదెలవలె పైకి మిసమిసలాడును. పసిపిల్లల ఉల్లాపనమువలె, వారుపట్టిన పిడికిళ్లవలె, మాయలవలె చిత్తమునకు మోహము కలిగించునట్టిది.

"ఈ జగత్తు హేతువులచేత, ప్రత్యయములచేత ప్రవర్తించుచున్నది. దీనిని బాలిశులు గ్రహింపలేకున్నారు. ఘటీయంత్రమునకు త్రాడుకట్టినప్పుడు, వ్యాయామబలమున లాగినట్టయిన చక్రము తిరుగుచు యంత్రము పనిచేయును. అంతియే కాని, దేనికది ప్రత్యేకముగ ప్రవర్తించుటలేదు. ఆ విధముగ ఒకదాని కొకటి అంగముగ నుండుననన్నియు ఒకదాని కొకటి సంబంధించి యుండును.

"బీజ మనునది యుండిననే దానినుండి యంకుర మేర్పడును. బీజములేనిచో అంకుర మనునది యుండదు. ఈ విధముగనే ఈ అనుచ్ఛేదము (సంసారము) అశాశ్వత లక్షణము గలది. ఈ సంసారము అవిద్యాప్రత్యయము. అనగా, లేనిగుణములు ఉన్నట్లు భాసించును. వాస్తవ మాలోచింపగా ఆ గుణములు దీనిలో లేవు. ఈ సంసారము నిజమైనది కాదు; అసత్తు. శూన్య మొక్కటియే నిజము. జనమునకు ఈ సంగతి తెలియదు.

"అరణి, ఉత్తరారణి, చేతితో తరచుట ఇవి మూడును కలసిననే అగ్ని ఉత్పన్నమగును. వెలిగి త్వరలో చల్లారును. పండితు డెవడో ఒకడు ఇది ఎక్కడినుండి వచ్చెను. ఎక్కడికి పోవును ? – అని దిక్కులను, విదిక్కులను వెదకును. కాని, దీని రాకగాని, పోకగాని తెలియదు. ఈ శబ్దము ఎక్కడినుండి వచ్చును ? ఎక్కడికి పోవును ? – అని ఒకానొక పండితుడు దిక్కులను విదిక్కులను వెదకినను ఈ శబ్దము గమనాగమనములను తెలియ లేడు.

"హేతువుల చేత, ప్రత్యయముల చేత సర్వ సంసార పద్ధతులును ప్రవర్తించుచున్నవి. నిరీహుడైన యోగి మాత్రమే వీని కంతటికిని మూలమైన భూతములను చూచుటవలన సమస్తము తెలియగలడు.

"నీవు ఇట్టి ధర్మ సూక్ష్మములను పూర్వ జన్మముల తపస్సువల్లను, దీపంకరబుద్ధుని దర్శనమువలనను తెలిసికొంటివి. నీవు తెలిసికొనిన విధముగ దేవతలకును, మానవులకును ఉపదేశము చేయుము.

"ఈ లోకము విపరీతమగు అభూతి కల్పనలతోను, రాగద్వేషములతోను మండిపోవుచున్నది. కృపి మేఘముల నుండి శీతలములయిన అమృతధారలను వర్షింపుము."

సిద్ధార్థునకు సంసారమునందలి దోషములు తెలియక పోలేదు. అంతఃపురమున వినవచ్చు ధర్మబోధనమువలన

తని మనమున వైరాగ్య ముద్దీపితమాయెను. సర్వవస్తువుల
యెడ నిరపేక్షయు, ప్రవ్రజ్యాభిలాషయు కలిగెను. వివేకము
అభ్యుదయమై నిష్క్రమణాభిప్రాయము బలపడినది. అతడు
నిష్క్రమణ మొనర్చుటకే నిశ్చయించెను.

ఆ సమయమున తుషితకాయికుడైన శ్రీ దేవుడను
దేవపుత్రుడు వేలకొలదిగానున్న దేవపుత్రులతో కూడి
సిద్ధార్థుడున్న ప్రాసాదమునకు వచ్చి, ధర్మప్రబోధవ్యాజమున
ఇట్లు స్తుతించెను :

"మహాకీర్తిమంతుడైన పురుషశ్రేష్ఠుడా, నీవు తుషిత
లోకమునుండి దిగివచ్చి భూలోకమున నీ పుట్టుకను ప్రక
టించితివి. రాజాంతఃపురమును చూచుటకు అంతఃపురమున నే
జన్మించితివి. లోకమర్యాదను కాపాడితివి. అభినిష్క్రమణ
మునకు ఇదియే నీకు తగినసమయము. ఈ విషయమును పరిశీ
లింపుము. తాను బద్ధుడై యున్నవాడు పైవారికి బంధ
మోక్షము చేయలేడు. గ్రుడ్డివాడు పరవారికి దారి యెట్లు
చూపగలడు? విడుదలపొందినవాడే ఇతరులను విడిపింప
గలడు. కన్నులున్నవాడే మార్గమును చూపగలడు. కోరి
కలకు దాసులైయుండు ప్రాణులు నీకు శిష్యులుగా చేరి
అభినిష్క్రమణము చేయవలెననుకోరికను పొందుదురు.
యౌవనమనునది సెలయేరు వంటిది. నీ యౌవనము గతించి
పోయినపిదప అభినిష్క్రమణము చేయవలెననుకోరిక

శోభింపదు. తరుణరూపమైన నవయౌవనమునందే అభి నిష్క్రమణముచేయుట మేలు. సురగణముల కోరికను సఫలము చేయుము. వారిని తరింపజేయుము. నీ ప్రతిజ్ఞను నిలబెట్టుకొనుము.

"సముద్రమునకు ఎంత నీరు వచ్చినను తృప్తికలుగ నట్లు ప్రాణులకు కోరికలవల్ల ఎంతమాత్రమును తృప్తి కలు గదు. వారికి ఉత్తమము, లోకోత్తరము అయిన ప్రజ్ఞను ప్రసాదించి తృప్తిపొందింపుము. ప్రజ్ఞాదీపమును చూపు అనుగ్రహించి ఉద్ధరింపుము."

బ్రహ్మదేవు డీట్లు సిద్ధార్థుని స్తుతించి, అభినిష్క్రమణ మునకయి హెచ్చరించెను.

ఫ్రీదేవు డిట్లు సిద్ధార్థ రాజకుమారునికి ప్రోత్సాహము కలుగజేసి, శుద్ధోదనమహారాజునకు కల వచ్చునట్లు చేసెను. రాత్రి బాగుగ మాటుమణగి ప్రశాంతముగానున్న సమయమున సిద్ధార్థుడు దేవగణములతోగూడ అభినిష్క్రమణము చేసినట్లును, సన్న్యాసియై కాషాయములు ధరించినట్లును శుద్ధోదనమహారాజునకు కలవచ్చెను. అతడు వెంటనే దిగ్గున లేచి, కంచుకుని పిలిపించి, "కుమారుడు అంతఃపురమున నున్నాడా? లేడా?" అని ప్రశ్నించెను. "అంతఃపురముననే యున్నాడు" అని కంచుకి సమాధాన మిచ్చెను. అయినను మహారాజు మనస్సునుండి శోకశల్యము తొలగిపోలేదు. పూర్వ నిమిత్తములవలన కుమారుడు ఇల్లు వదలిపోవుట తథ్యమని అతని మనస్సునకు బాగుగ తట్టెను. కనుక కుమారుడు అంతఃపురము వదలి ఉద్యానమునకు వెళ్ళనిరీతిని ఏర్పాట్లుచేసిన, అంతఃపురమునందే స్త్రీలనడుమ మసలుచు ఉండగలడని అతనికి తోచెను.

అందువలన మహారాజు కుమారుని సుఖానుభవమునకై మూడు భవనములు కట్టించెను. వానిలో ఒకటి వేసవి భవనము; మరియొకటి వర్షాకాలపు భవనము; ఇంకొకటి హేమంతకాలపు భవనము. వేసవిభవనము ఎప్పుడును

చల్లగనుండును. వర్షాకాలపుభవనమున శీతోష్ణములు సమానముగ నుండును. హేమంతకాల భవనమున వెచ్చగ నుండును. ఈమూడు భవనములకును వేరువేరుగ బల్లల పెట్టించెను. అవి భవనములకు వేయుటకును, తీయుటకును తగినట్లుండెను. వానిని అమర్చుటకును, తీయుటకును అయిదు వందలమంది భటులు నియమితులైరి. వానిని వేయునప్పు డును, తీయునప్పుడును పెద్దధ్వని యగుచుండెను. ఆధ్వని అర్థయోజనమునరకును వినబడుచుండెను. కుమారుడు తనకు తెలియకయే ఇల్లుదాటి పోగూడదను సంకల్పముతోనే మహారాజు ఈ ఏర్పాట్లుచేసెను. నగర మంగళద్వారము నుండి కుమారుడు అభినిష్క్రమణము చేయునని దైవజ్ఞులు వైపంచికులు చెప్పుటవలన మహారాజు నగర మంగళద్వా రమునకు పెద్దపెద్ద తలుపులు పెట్టించెను; తలుపులు మూయు టకును, తెరచుటకును అయిదువందలమంది భటులను నియ మించెను. కుమారుని చుట్టును మూగి అతని గుణగణములు ప్రశంసించుటకై మరి అయిదువందలమంది యువతులను నియ మించెను. ఆ యువతులు ఎల్లప్పుడును గీతములు పాడుచు, వాద్యములు వాయించుచు రాజకుమారుని అనుసరించియే యుండుదురు.

ఇట్లుండగా ఒకనాడు రాజకుమారుడు సారథిని పిలి పించి "సారథీ, వేగముగా రథమును సిద్ధపరచుము. నేను

ఉద్యానమును చూచుటకు వెళ్ళదలచినాను.'' అని ఆదేశిం
గెను. సారథి వెంటనే శుద్ధోదన మహారాజువద్దకు వెళ్ళి ఈ
వార్తను విన్నవించెను. ఇదివరకు నేను కుమారుని చక్కని
దృశ్యములు చూచుటకు ఉద్యానమునకు పంపలేదు. అతనిని
పంపినచో, అతడు స్త్రీలతోపాటు ఉద్యానమునకువెళ్ళి వినో
దముగ కాలముగడపివచ్చును. సుఖమనునది తెలిసికొనును.
అతనికి అప్పుడు గృహపరిత్యాగబుద్ధి కలుగకపోవచ్చును-
అని మహారాజు భావించి ''నేటికి ఏడవనాడు రాజకుమారుడు
చక్కని దృశ్యములు చూచుటకు ఉద్యానవనమునకు
వెళ్ళును. ప్రజలు చూడరాని దృశ్యములను తొలగించ
వలెను. అతనికి ప్రతికూల దృశ్యము లేవియు కనబడరాదు.
రమ్యముగ నుండునవియే యుండవలెను'' అని చాటింపించెను.

ఏడవనాటికి పట్టణమంతయు చక్కగా నలంకరింప
బడెను. ఉద్యానవనమును చక్కగ నలంకరించిరి. రంగు
రంగుల మేలుకట్లు, ఛత్రములు. ధ్వజపతాకములు తగిన
చోట్ల నుంచిరి. ఉద్యానమార్గమును రమ్యముగ నలంకరిం
చిరి. మార్గముపై ఒత్తుగ గంధోదకము, పూవులు చల్లి,
గంధఘుటికలతో ధూపములు వేసిరి. పూర్ణకుంభము లుంచిరి.
అరటిస్తంభములు కట్టిరి. మేలుకట్లు సవదరించిరి. వానికి రత్న
ములతోను, మువ్వాలతోను హారములును, అర్ధహారములును
వ్రేలాడగట్టిరి. రాజకుమారుడు గొప్ప సంరంభముతో కపిల

వస్తు మహానగరము తూర్పుద్వారమునుండి ఉద్యానవనము నకు బయలుదేరెను.

శుద్ధావాసకాయికులను దేవపుత్రులు మాత్రము అదృశ్యముగ రాజకుమారుని వెన్నంటియే యున్నారు. ఆతనిని గృహమునుండి వెలుపలకు తీసికొనిపోవుటయే వారి సంకల్పము. ఈ దేవపుత్రులు రాజకుమారుని మనస్సును అనుసరించియే ఉద్యానమార్గమున ఒకనిని నిలబెట్టిరి. అతడు చాల వృద్ధుడు. అవయవములన్నియు జీర్ణించిపోయి. శరీరము నందలి నరములన్నియు బయటికి తేలి, పండ్లూడిపోయి, దేహము ముడుతలుపడి, తల పండిపోయి, తత్తరపడుచు కర్రయూని నిలబడియుండెను. ఆ వృద్ధుని కంఠమునుండి గురగురధ్వని బయలుదేరినది: అవయవములన్నియు వణకి పోవుచున్నవి.

రాజకుమారుడు ఆ వ్యక్తిని చూచెను. "సారథీ. ఈ మనిషి చాల దుర్బలుడుగను, శక్తిహీనుడుగను ఉన్నాడు. మాంసము శుష్కించిపోయినది. రక్తము ఇంకిపోయినది. నరములతో కట్టిన తోలుబొమ్మవలె ఉన్నాడు. తల బాగుగ నెరసినది. పండ్లు ఊడిపోయినవి. రూపము వికారముగ నున్నది. మిక్కిలి శ్రమపడుచు, జారుచు, పడుచు లేచుచు కర్రపట్టుకొని నడచుచున్నాడు. ఎందులకు ఇట్లున్నాడు?" అని రాజకుమారుడు సారథిని ప్రశ్నించెను.

"ఓ దేవా, ఈ మనిషిని ముసలితనము లోబరచుకొనినది. ముసలివారికి ఇంద్రియములు క్షీణించును. బలము, శక్తియును హరించుకొనిపోవును. శ్రమ ఎక్కువ యగును. అట్టివానిని ఎవరును ఆదరించరు. దగ్గరిబంధువులును వదలి వెళ్ళుదురు. వృద్ధుని ఏపని చేయలేడు; అడవిలో వదలిన దొంగవలె నుండును" అని సారథి రాజకుమారునికి సమాధాన మిచ్చెను.

రాజకుమారునికి మరల సందేహము కలిగెను. "ఈ విధముగ ముసలివాడు కావుట కులధర్మమా? ఇట్లగుటవలన ఇతనికి మేలు కలుగునా? లేక యిది లోకసామాన్యపరిపాటియా? త్వరగా తెలుపుము. నీ సమాధానము విని దీని కారణములేమియో యోచింతును" అని అతడు మరల ప్రశ్నించెను.

"దేవా, ఇది కులధర్మముగాని, రాష్ట్రధర్మముగాని కాదు. లోకమున యౌవనముగలవారందరినీ ముసలితనము ఆక్రమించును. మనము, మన పెద్దలు, బంధువులు, జ్ఞాతులు–అందరును దీనికి లొంగ వలసినదియే. అది ఎవ్వరిని వదలదు." అని సారథి సమాధాన మిచ్చెను.

"సారథీ, చూడుము. అవిద్వాంసులైన ఈ జనులు బాలురవలె ఏమాత్రమును తెలుసుకొనలేనిస్థితిలో ఉన్నారు. యౌవన మున్నప్పుడు మదించి తమకు ముదిమిరానున్న

దని గ్రహింపలేరు. రథమును మరలింపుము. పట్టణమునకు వెళ్లుదము. ముసలితనము కాచుకొనియున్న నాకీ విలాసముల తోను, వినోదములతోను ఏమి నిమిత్తమున్నది?" అని రాజకుమారుడు హెచ్చరించెను.

సారథి రథమును మరలించెను. వారు పట్టణమును ప్రవేశించిరి.

మరియొకప్పుడు రాజకుమారునికి ఉద్యానవనమునకు వెళ్ళవలెనను సంకల్పము కలిగెను. ఈమారు అతడు నగర దక్షిణద్వారముగుండా పెద్ద సన్నాహముతో బయలు దేరెను. మార్గమధ్యమున అతనికి వ్యాధిగ్రస్తుడగు ఒక వ్యక్తి కనిపించెను. అతని శరీరము శుష్కించినది. కడుపు లోపలికి వట్టిపోయినది. మలమూత్రములు విసర్జించుచు, వానిలోనే పొరలాడుచుండెను. ఎంతయో శ్రమముతో ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుపుచు దిక్కులేని స్థితిలో నుండెను. అతనిని చూచి రాజకుమారుడు ఇట్లుండుటకు కారణమేమని సారథిని ప్రశ్నించెను. సారథి ఇట్లు ఉత్తర మిచ్చెను:

"దేవా, ఈ పురుషుడు చాల దుర్బలుడు. వ్యాధి గ్రస్తుడై మరణించుస్థితిలో నున్నాడు. బలము క్షీణించి పోయినది. ఆరోగ్యము నశించినది. తేజస్సు పోయినది. రక్షణములేదు. భూమియే ఇతనికి దిక్కు. ఇతనికి దేనిమీదను

ఆసక్తి యుండదు.'' అని సారథి వివరించెను. అది విని రాజ కుమారునిలో ఆలోచన మొదలెను.

''ఆరోగ్యమనునది స్వప్నము వలె భాసించుచున్నది. వ్యాధి భయంకరమైనది. అది మనుష్యుని రూపమును ఘోరముగ మార్చివేయును. విజ్ఞుడయినవాడు అట్టి అవస్థను చూచుచు వినోదించుట కెట్లు సంకల్పించుకొనునో గదా! ఆశ్చర్యము!'' అని రాజకుమారుడు సారథితో పలికి రథమును మరలింపుమని చెప్పి, మరల అంతఃపురమును చేరుకొనెను.

మరికొంత కాలమునకు రాజకుమారునికి ఉద్యానవనమునకు వెళ్లవలెనను ఆకాంక్ష పుట్టినది. అతడు ఈమారును గొప్ప సన్నాహముతో బయలుదేరెను. ఈ మారు నగరపు పడమటి ద్వారమునుండి పయనమయ్యెను. దారిలో అతనికి ఒక పురుషశవము కనిపించెను. దానిని పాడెపై పెట్టి కొందరు మోసికొని పోవుచుండిరి. పాడెమీద ఒక గుడ్డను మేలుకట్టుగా కట్టియుంచిరి. శవము వెంబడి బంధువులు ఏడ్చుచు, అరచుచు, జుట్టు విరియబోసికొని దుమ్ముచల్లుకొనుచు, రొమ్ము బాదుకొనుచు నడచుచుండిరి. ఇది చూచి రాజకుమారుడు ''ఈ విలాపవాక్యములకు కారణమేమి?'' అని సారథిని అడిగెను. సారథి ఇట్లని సమాధానమిచ్చెను :

''దేవా, జంబూ ద్వీపములో నున్న ఈ మనుష్యుడు

మరణించినాడు. ఇతడు మరల తలిదండ్రులను గాని, భార్యా పుత్రులను గాని చూడలేడు. భోగ గృహ మిత్ర జ్ఞాతి సంఘమును వదలి వెళ్లిపోవును. మరణించినవానికి సహాయులు ఎవ్వరును ఉండరు. మరణించినవాడు పరలోకమునకు పోవును.''

అప్పుడు రాజకుమారుని మనసు మారినది. ''యౌవనమును, ముసలితనమును అసహ్యమైనవే. ఆరోగ్యమును అటువంటిదే. అది అనేక విధములుగ రోగముల మూలమున చెడిపోవును. జీవితము వ్యర్థమయినది. అస్థిరుడైన విద్యాంసునివల్ల ప్రయోజనము లేదు. పండితుని సుఖప్రసంగములు నిష్ప్రయోగములు. ముసలితనము గాని, రోగము గాని, మృత్యువుగాని లేకపోయినను దుఃఖమనునది తప్పదు. కనుక వెనుకకు వెళ్లిపోయి మోక్షమార్గమును గురించి ఆలోచింతును.'' అని అంతః పురమునకు వెళ్లిపోయెను.

కొంతకాలమునకు రాజకుమారునికి ఉద్యానవనమునకు వెళ్లుదమను బుద్ధి మరల కలిగినది. ఈమారు అతడు నగరము ఉత్తర ద్వారమునుండి బయలుదేరెను. అతని వెన్నాడుచున్న దేవపుత్రులు ఈసారి అతని మార్గమున ఒక భిక్షువును నిలబెట్టిరి. ఆ భిక్షువు శాంతుడు, దాంతుడు, ఓరిమిగలవాడు, బ్రహ్మచారి, చలనము లేని చూపులతో కాడి మేరమాత్రమే చూచు నియమవంతుడు. మేలైన తపో

మార్గమును అనుసరించినవాడు. అభిక్రమ ప్రక్రమనముల తోను, స్వచ్ఛమయిన అవలోకిత వ్యవలోకితములతోను ఉన్నవాడు. అతడు చీవరములు, భిక్షాపాత్ర ధరించియుండెను. అతనిని తిలకించిన రాజకుమారుడు అత డెవ్వడని సారథిని ప్రశ్నించెను.

అప్పుడు సారథి "దేవా, ఇతడొక భిక్షువు. ఇతడు కోరికలను, సుఖములను వదలి, వినీతుడయి సన్న్యాసమును స్వీకరించెను. అందరిని తనతో సమానముగ చూచుచు రాగద్వేషములను వదలినవాడు. పిండచర్యతో (భిక్షాకబళములు యాచించి) జీవించుచున్నాడు." అని చెప్పెను.

రాజకుమారుడు అది విని చాలసంతోషించెను. అతనితో ఇట్లనెను: "సారథీ, నీవు చెప్పినది మిగుల బాగుగనున్నది. ఈ పద్ధతియే నాకును మిగుల ఇష్టము. సన్న్యాసమునే విద్వాంసు లందరును ఎంతగనో ప్రశంసింతురు. దాని వలన తనకును, తనవలన ఇతరులకును మేలు కలుగును; జీవితము సుఖమయముగా నుండును; అమృతమయమైన ఫలమును లభించును." రాజకుమారుడు సారథితో ఈ విధముగా నని రథమును మరలింపజేసి నగరు చేరెను.

## ౧౪

రాజకుమారుని నిశ్చయము శుద్ధోదన మహారాజునకు తెలిసెను. అతడు రాజకుమారుడు ఇల్లు, ఊరు కదలి వెళ్లి పోవుటకు వీలు లేనట్లు నగర ప్రాకారములను బలముగను, ఎత్తుగను కట్టించెను. అగడ్తలను లోతుగ త్రవ్వించెను. ద్వారములు బలమైనవిగ నుండునట్లు ఏర్పాటుచేసెను. రక్షకులను ఆయాయి స్థలములలో నియమించెను. శూరులను హెచ్చరించెను. రాజకుమారుడు తప్పించుకొనినచో పట్టుకొనుటకు నగర చతుష్పథములలో పెద్ద సైన్యములను నిలిపెను. ఆ వీరభటులు రాత్రిందినములను బోధసత్త్వుని కాచుచుండిరి. అతడు అభినిష్క్రమణము చేయకుండ జాగరూకతతో నుండిరి. ''ఒకప్పుడును సంగీతమును నిలుపగూడదు'' అని మహారాజు అంతఃపురమునకు కట్టడిచేసెను. సమస్తములైన వినోదములను నిరంతరము కొనసాగించుచుండవలెననియు, రాజకుమారుడు అనురక్తచిత్తుడై యుండునట్లును, సన్న్యాసముపై అతని మనస్సు పోకుండునట్లును చూడవలెననియు మహారాజు తన పరివారమును హెచ్చరించెను.

మహారాజు ఇంత ప్రయత్నించినను రాజకుమారుని మనసు మారలేదు. అతడు లోకమును మంచిమార్గమున

నడపుటకు సారథిగా అభినిష్క్రమణము చేయనున్న సమయమున కొన్ని నిమిత్తములు కనిపించినవి. హంసలు, క్రౌంచములు, నెమళ్లు, గోరువంకలు, చిలుకలు మొదలయిన పక్షులు కూయుటయే మానివేసినవి. మేడలమీద, గవాక్షములలోను, తోరణములమీద, మంచెలమీద జనులు కలతపడిన మనస్సులతో తలలు వంచుకొని ఏదియో ఆలోచించుచుండిరి. తామరకొలకులలో తామరపూవులు ముకుళించుకొని పోసాగెను. చెట్ల ఆకులు ఎండి రాలిపోయినవి. పూవులు కనబడకపోయినవి. చెట్లు మరల పుష్పించలేదు. వీణలు మొదలయిన తంత్రీవాద్యముల తీగలు హఠాత్తుగా తెగిపోసాగినవి. భేరి, మృదంగము మొదలయిన వాద్యములు చేతితో కొట్టినను పలుకలేదు. వాని చర్మములు పగుళ్లు వారినవి. కపిలవస్తు మహానగరము కలతపాటుతో నిద్రపోవుచున్నట్లుండెను. ఎవ్వరికిని గానముచేయుటకు గాని, నాట్యమొనర్చుటకుగాని మనస్సుపుట్టలేదు. మహారాజు దీనమయిన మనస్సుతో "అయ్యో! శాక్యవంశమున మహాధీమంతుడైన రాజకుమారుడు విరక్తుడై అరణ్యములకు పోనిమార్గ మేదియైన కలదా?" యని ఆలోచించుచు కాలము గడుపసాగెను.

ఆనాటి రాత్రి రాజకుమారుడగు సిద్ధార్థుడు శయ్యపై పరుండియుండెను. అతనిభార్య గోపయు అతనిప్రక్కనే మరి

యొక మంచముమీద పరుండియుండెను. అర్ధరాత్రమున గొప్ప కొక కల వచ్చెను. ప్రపంచమంతయును కంపించు చున్నట్లును, పర్వతములు ఊగిసలాడుచున్నట్లును, వృక్షములు వేళ్లతోగూడ పెల్లగిల్లి పోవుచున్నట్లును కనిపించెను.

సూర్యచంద్రులు నక్షత్రములతోపాటు నేలమీదికి రాలిపోయెను. తన జుట్టు దక్షిణపార్శ్వమున ఊడిపోయెను. కిరీటము భుజముపై జారిపడిపోయెను. తన కాలుసేతులు ఛేదింపబడెను. తాను నగ్నమైనట్లును, తన మెడలోని ముత్యాలహారము, నడుములోని మణిమేఖల తెగిపోయి నట్లును కనిపించెను.

రాజకుమారుడు కోళ్లు విరిగిపోయిన మంచముమీది నుండి భూమిమీదికి దొర్లిపోయి, అక్కడే పండుకొని యున్నట్లు, రత్నచిత్రములు విరిగినట్లు, రాజచిహ్నము లయిన ఛత్రము, దండము విరిగిపోయినట్లు, ఆభరణము లన్నియు చెల్లాచెదరుగ నేలమీద పడిపోయినట్లు, రాజ కుమారుని వస్త్రములు, కిరీటము నీటిలో పడిపోయినట్లు కలలో కనిపించెను.

కపిలవస్తునగరమునుండి ఒక తేజోరేఖ ఎక్కడికో కదలివెళ్లినట్లు, నగరమంతయు చీకటిలో మునిగినట్లు, నగరులో అలంకరించిన రత్నజాలికలు తెగిపడినట్లు, మహా

సముద్రము కల్లోలితమయినట్లు, మేరుపర్వతము తనస్థానమును తప్పి కదలినట్లు కలలో కానవచ్చెను.

గోప ఇట్టిస్వప్నము గని, స్వప్నానంతరము మేల్కాంచెను. ఆమె మనస్సు చాల ఉద్విగ్నమయ్యెను. కన్నులు తెరచి దిక్కులు కలయజూచి భర్త తనప్రక్కన ఉన్నాడో, లేడో తెలుసుకొనుటకు నిదానముగ ఆ వైపు పరికించి చూచెను. అతడు అక్కడే యుండుట చూచి ఆమె మనస్సు కుదుటబడెను. ఆమె అతనితో తాను కనిన కల వివరించి "దేవా, ఇట్టి స్వప్నములవలన ముందు ముందు ఎట్టి ఫలితములు కలుగునో తెలుపుడు. నాకు చాల కలతగ నున్నది. నా స్మృతి భ్రమించినది. మనస్సు శోకార్తితమైనది. దుఃఖము పొంగి వచ్చుచున్నది" అని విన్నవించెను.

సిద్ధార్థ రాజకుమారుడు గోపతో ఇట్లనెను: "గోపా, ఇట్టి స్వప్నములు వచ్చినందులకు చాల సంతోషించుము. వీనివల్ల నీకు ఎట్టి చెరుపును కలుగదు. పూర్వజన్మమున ఎంతయో పుణ్యము చేసికొన్నవారికే ఇట్టి కలలు వచ్చును. సామాన్యులకు ఇట్టి మంచి కలలు ఎన్నటిని రావు. భూమి కంపించిపోవుచున్నట్లు, కొండలు భూమిమీదినుండి దొరలి పోవుచున్నట్లు నీకు కల వచ్చుటవల్ల దేవనాగరాక్షస భూతాదులసంఘములు నిన్ను పూజించి శ్రేష్ఠురాలినిగా చేయుదురని తెలుసుకొనుము. వేళ్లు పెల్లగిలి చెట్లు కూలి

పోయినట్లు కల గనుటవలన నీవు సృష్టి సమూహములను ఉద్ధరించగలవు. సూర్యచంద్రులు, గ్రహనక్షత్రములు పడి పోవుచున్నట్లు కలవచ్చుటవలన నీవు క్లేశములను శత్రువులను నశింపజేసి లోకమునకు పూజ్యురాలవై కీర్తిపొంద గలవు. ముక్తాహారము తెగినట్లు, నీవు నగ్నయయినట్లు కల వచ్చుట నీవు త్వరలోనే స్త్రీశరీరము వదలి పురుషశరీర మును పొందగలవనుటకు సూచన. మంచపుకోళ్లు విరిగి పోయినట్లు, ఛత్రము, దండము విరిగిపోయినట్లు, రత్నాల చిత్రములు పగిలిపోయినట్లు కలవచ్చినందున నాల్గుప్రవాహ ములను నీవు దాటి ముల్లోకములకు ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన నన్ను చూడగలవు. కపిలవస్తు మహానగరము నుండి శతకోటి దివ్యజ్యోతులు వెడలిపోయినట్లును, పట్టణ మంతయును చీకటికోణముగా నున్నట్లును కలవచ్చుట మోహావిద్యలనుఅంధకారముతో నిండిన లోకమున ప్రజ్ఞా కాంతిని నేను ప్రసరింపజేయుటకు సూచన.''

గోప భర్తమాటలకు కుదుటబడి హాయిగా నిద్రింప సాగెను.

సిద్ధార్థునికి కూడ ఆరాత్రి స్వప్నములు కలిగినవి. నాలుగు సముద్రములను అతడు కాలుసేతులతో కొట్టుచు దాటుచున్నట్లు, భూమినంతటిని శయనముగను, మేరు

పర్వతమును తలగడగను ఏర్పరచుకొనినట్లును కలగనెను. అతడు సంగ్రామ మధ్యమున విజయముపొంది మేరు పర్వతపు సానువుపై ఆసీనుడయి యున్నట్లు, శిష్యులు చేతులు జోడించుకొని తనను సేవించుచు నున్నట్లు, గగనమువిూద దేవతలు "ఆనందము! ఆనందము!" అని పలుకుచున్నట్లు కలగనెను. ఇవి యన్నియును తన మహాభినిష్క్రమణమునకు శుభసూచనములని సిద్ధార్థుడు భావించి సంతోషించెను.

## ౧౫

గృహ పరిత్యాగమునకు నిశ్చయించిన సిద్ధార్థునికి మనసులో నొక యాలోచన కలిగెను: "తండ్రిగారికి నా అభిమతము వివరించి చెప్పి వారి అనుమతి పొందక గృహ పరిత్యాగము చేయుట అనుచితమును, కృతఘ్నతయును కాగలదు. అందువలన నేను తండ్రిగారికి ఈ విషయము తెలియజేయుదును" అని.

సిద్ధార్థుడు ఈ విధముగా భావించి, రాత్రి మాటు మణగినపిదప తన నివాసభవనము దిగి శుద్ధోదన మహారాజు ప్రాసాదమునకు వెళ్లెను. అతని తేజస్సుతో భవనము నిండి పోయెను. మహారాజు మేలుకొని ఆ వెలుగును చూచి, కంచుకిని పిలచి "ఏమిటి కంచుకీ, అప్పుడే సూర్యుడు ఉదయించెనా? ఇంత వెలుగు వచ్చినది?" అని ప్రశ్నించెను. కంచుకి "దేవా, రాత్రిలో ఇంకను సగమయినను కాలేదు. సూర్యుని కాంతియయిన గోడలమీదను, చెట్లమీదను నీడ వ్యాపించును; శరీరమునకు వేడి కలుగును; చెమట పట్టును. హంసలు, నెమళ్లు, చిలుకలు, కోకిలలు, చక్రవాకములు ప్రత్యూషకాలమున మధురముగ ధ్వనిచేయును. ఈ కాంతి మనోజ్ఞమయినది. సంతోషమును, సుఖమును కలిగించు

చున్నది. గోడలమీద, చెట్లమీద నీడలు కానరావు. తేజో వంతుడును, గుణధరుడును నైన ఆర్యుడు ప్రవేశించి యుండును.'' అనెను.

శుద్ధోదనుడు ఆ మాటలు విని పదిదిక్కులును పరికించెను. అతనికి కమలములవంటి కన్నులుగలవాడు, శుద్ధ సత్త్వుడు అయిన రాజకుమారుడు కానవచ్చెను. అతడు పడకమీదినుండి లేచుటకు ప్రయత్నించెను. కాని, అది సాధ్యముకాలేదు. రాజకుమారుడు అభివాదనముచేసి పితృ గౌరవమును వెల్లడించెను.

తరువాత రాజకుమారుడు తండ్రియెదుట నిలబడి ఇట్లనెను: ''తండ్రీ, నా ప్రయత్నములకు విఘ్నము కలిగింప వలదు. ఎంతమాత్రమును చింతపడవలదు. ఇది నాకు అభి నిష్క్రమణము చేయవలసిన సమయము. నీవు రాష్ట్రజన సహితముగా నన్ను మన్నింపుము.''

శుద్ధోదనుని కన్నులలో నీరు క్రమ్మెను. అతడు కుమారులతో ''నాయనా, అభినిష్క్రమణము చేయవద్దు. ఇక్కడ నీవు ఉండిననే చాల ప్రయోజనమున్నది. నీవు కోరినది సమస్తమును సమకూర్తును. నన్ను, ఈ రాజకుల మును, ఈ రాజ్యమును అనుగ్రహింపుము. ఏ వరము కావలెనన్నను ఇత్తును.'' అని బ్రతిమాలెను.

సిద్ధార్థుడు మృదు మధుర వాక్కులతో ''దేవా

అట్లయిన నాకు నాలుగు వరము లిమ్ము. వానిని నీవు ఇచ్చి తివా, నేను అభినిష్క్రమణము తలపెట్టక రాజప్రాసాదము నందే యుండిపోవుదును. ఆ వరములలో మొదటిది: నాకు ఎన్నడును ముదిమి రాకూడదు. నేను నవనవలాడుచు ఎల్లప్పుడును యౌవనముననే యుండవలెను. రెండవ వరము: నాకు ఎన్నడును వ్యాధి రాగూడదు. నిరంతరము ఆరోగ్యమే యుండవలెను. మూడవ వరము: నాకు చిరాయువు ఉండవలెను. ఎన్నడును మరణము రాగూడదు. నాలుగవ వరము: నాకు సర్వదా సంపత్తియే కలుగుచుండవలెను. విపత్తి కలుగనేరాదు.'' అనెను.

ఆ మాటలకు శుద్ధోదనుడు మిక్కిలి దుఃఖార్తుడై ''నాయనా, నీవు అస్థానమున అసాధ్యములైన వరములు కోరుచున్నావు. వీనిని ప్రసాదించు శక్తి నాకు లేదు. జరా వ్యాధిమరణములను, ఆపత్తులను తప్పించుకొనినవారు ఎవ్వరును లేరు. కల్పాంతములవరకు ఉండు ఋషులుగూడ వీని నుండి విడుదల పొందలేకపోయిరి.'' అనెను.

''అయినచో నామాట విని వేరొక్క వరము మాత్రము అనుగ్రహింపుడు. దానికి ఎంతమాత్రమును వ్యతిరేకముగ సమాధానము చెప్పకుడు. లోకమునకు హితమును, మోక్షమును కలుగజేయుటకు ప్రయత్నింతును. ఈ వర మొక్కటి ప్రసాదించు.'' అని సిద్ధార్థుడు కోరెను. శుద్ధోదనమహారాజు

ఆ మాటలు విని ఆశ తగ్గించుకొని, పుత్ర స్నేహపాశమును గూడ త్రెంచివేసికొని, "సరే. నీ యిష్టమే జరుగుగాక! నీ అభిమతము పరిపూర్ణత పొందుగాక!" అనెను.

అనంతరము సిద్ధార్థుడు తండ్రిభవనమునుండి తన భవనమునకు తిరిగివచ్చెను.

ఆ రాత్రి గడచి తెల్లవారినపిదప శుద్ధోదనమహారాజు శాక్యగణములను పిలిపించి, సమావేశపరచి, రాత్రి జరిగిన విషయముల వివరించి, "రాజకుమారుడు తప్పక అభినిష్క్రమణము చేయగలడు. దానికి మనము ఏమిచేయవలెను?" అని ప్రశ్నించెను.

"దేవా మేము రాకుమారుడు కదలకుండ కట్టుదిట్టములు చేయుదుము. మేము చాలమంది యున్నాము. అతడు ఒంటరిగాడు. ఎట్లు దాటిపోగలడు?" అని శాక్యు లనిరి.

ఆ శాక్యులును, శుద్ధోదనుడును సిద్ధార్థుడు ఇల్లు కదలకుండ కాపలాకాయుటకు పలువురు శస్త్రాస్త్రనిపుణులయిన శాక్యకుమారులను నియమించిరి. నగరపూర్వద్వారమువద్ద ఐదువందలమంది శాక్యకుమారులు కావలియుండిరి. ఇట్లే దక్షిణపశ్చిమోత్తరద్వారములయందును శాక్యవీరులు నియమితులైరి. మహల్లక మహల్లికలను శాక్యులతెగవారు నగరములోని చతుష్పథములయందును, శృంగాటకములలోను, రథ్యలయందును, జనము గుంపులు

గూడ ప్రదేశములయందును జాగరూకులై యుండిరి. మహారాజు మరి అయిదువందలమంది శాక్యవీరులతోపాటు స్వగృహద్వారమువద్ద కావలియుండెను.

మహాప్రజాపతి గౌతమి చేటికలను పిలచి ఇట్లాజ్ఞాపించినది: "మీరు దీపములను పరిశుభ్రపరచి కాంతి వ్యాపించునట్లు వెలిగింపుడు. ధ్వజాగ్రములయందు మణులు సమకూర్చుడు. మణిహారములు ధరింపుడు. భవనమంతయు వెలుగుతో నుండునట్లుచేయుడు. సంగీతము ప్రారంభింపుడు. ఈ రాత్రి నిద్రింపక మేలుకొనియుండుడు. రాజకుమారుడు మనకు తెలియకుండ వెళ్లిపోవుటకు వీలుకలిగింపక భద్రముగ చూడుడు. కవచములు ధరింపుడు. కత్తి, ధనుర్బాణములు, శక్తి, తోమరము మొదలయిన ఆయుధములను ధరించి, సర్వజనేష్టుడైన రాజకుమారుని రక్షణమహాప్రయత్నములో ఉండుడు. ద్వారములన్నియును మూసివేసి గట్టిగ అడ్డుగడియలు బిగింపుడు. అకాలమున తలుపులు తెరువకుడు. తెరచిన, రాజకుమారుడు వెళ్లిపోయీని! మణిహారములు, ముక్తాలతలు, ముఖపుష్పకము (పాపటపూవు), చంద్రవంక, మొలనూలు, కర్ణాభరణము, అంగుళీయకము, అందెలు మొదలయిన నగలను అలంకరించుకొని ఆకర్షణీయముగ నుండుడు. రాజకుమారుని గమనమునకు విఘాతము కలుగునట్లు మీ మీ పరాక్రమము చూపుడు. శక్త్యాయుధములు ధరించిన యువతులు

రాజకుమారుని శయనము చుట్టును చేరి సూర్యునివలె కన్నులు తెరచుకొనియే కనిపెట్టుకొని యుండుడు. వేణునాదములు చేయుచు రాత్రియంతయును భద్రముగా నుండుడు. ఒకరినొకరు హెచ్చరించుకొనుచు నుండుడు. రాజకుమారుడు గృహపరిత్యాగము చేసి వెళ్ళిపోయినచో, రాజకులమంతయును విషాదమున మునిగిపోవును; తరతరములుగ వచ్చుచున్న రాజవంశము విచ్ఛిన్నమై పోవును."

ఎవరికి వారు ఇట్లు ఏర్పాట్లు చేయుచుండగా, సిద్ధార్థుడు అంతఃపురమున సుఖశయ్యపై పవ్వళించి పూర్వప్రణిధానములను స్మరించుకొని, కృతనిశ్చయుడాయెను. ఆ సమయమున దేవతలును అతనికి విరాగభావమును అధికముచేసి, గృహపరిత్యాగమునకు ప్రేరేపించిరి. అతనికి అంతఃపురము మహాబీభత్సముగా నున్నట్లు, తాను శ్మశానమధ్యమున నున్నట్లు తోచెను. రాజకుమారుడు తనచుట్టును కావలియున్న నారీగణమును చూచెను. వారందరును అలసిపోయి నిద్రమత్తులో నున్నారు. వారిలో కొందరి వస్త్రములు తొలగిపోయినవి. కొందరి జుట్టుముడి వీడిపోయినది. కొందరి ఆభరణములు జారిపోయినవి. కొందరి కిరీటములు ఒరిగిపోయినవి. కొందరి అవయవములు వస్త్రవిహీనములయినవి. కొందరు ప్రక్కవారి భుజముపై వాలినారు. కొందరు కన్నులు మూసికొనియుండిరి. కొందరి ముఖములు ప్రక్కకు తిరిగియుండెను. కొందరి నోటినుండి

చొంగ కారుచుండెను. కొందరు దగ్గుచుండిరి. కొందరు నవ్వుచుండిరి. కొందరు పండ్లు పటపట కొరుకుచుండిరి. కొందరి ముఖములు వెలవెలపోయి యుండెను. కొందరి శరీరములు వదలిపోయియుండెను. కొందరి చేతులు వ్రేలాడుచుండెను. కొందరి కాళ్లు అటునిటు తొలగియుండెను. కొందరు తలలు వ్రేలవేసికొని యుండిరి. కొందరు ముసుగు వేసికొనియుండిరి. కొందరు పెడమొగము పెట్టుకొని యుండిరి. కొందరు వంగిపోయి గురగురలాడుచుండిరి. కొందరు తమ యొడిలోని మృదంగముమీదనే సోలిపడి యుండిరి. కొందరి చేతులలోని వేణు వీణాదివాద్యములు జారిపోయినవి. కొందరు నోటనున్న వేణువును పండ్లతో కటకటలాడించుచుండిరి. కొందరు మూగన్నులతో నుండిరి. కొందరి చేతులు వాద్యభాండములమీదినుండి జారిపోవుచుండెను. కొందరు నోరు తెరచుకొని నిద్రించుచుండిరి. వారిని చూచిన రాజకుమారునికి అంతఃపురము శ్మశానమను బుద్ధియే ధ్రువపడెను. అతడు ఇట్లు చింతింపసాగెను:

"ఆహా! వీరికి ఎంతటి మోహాంధకారము! వివేకరహితులైన వీరు వధ్యస్థానములోని వధ్యులవలె చంపబడుచున్నారు. అవిద్వాంసులు అమేధ్యముతో నిండిన చిత్రఘటములను చూచి ఆనందించినట్లు వీరును ఆనందపడుచున్నారు. నీటిమధ్యమున ఏనుగులవలె మునుగుచున్నారు. చెరసాలలోని దొంగలవలె ఏడ్చుచున్నారు. వరాహముల

వలె అశుచిలో పడియున్నారు. అస్థిపంజరముల మధ్య కుక్కలున్నట్లు ఉన్నారు. దీపముమీద మిడుతలు పడినట్లు పడిపోవుచున్నారు. ఎరలో మోసపోయిన కోతులవలె బంధనమున ఇరుకకొనియున్నారు. వలలు పన్ని బయటికి తీసిన చేపలవలె తపించిపోవుచున్నారు. వధ్యప్రదేశమున నున్న గొర్రెలవలె అరచుచున్నారు. శూలాగ్రముమీద నున్న పాపాత్ములవలె అణగిపోవుచున్నారు. మహాసముద్రమున పగిలిపోయిన నావవలె ఆపదపొందుచున్నారు. పెద్ద ప్రవాహమున పుట్టుగ్రుడ్డివలె పడిపోవుచున్నారు. పాతాళ సంధిని పొందిన సేటివలె పర్యాదానము (తిరుగుడు) పడుచున్నారు. ప్రళయసమయమున భూమండలమువలె ధూమాక్రాంతులగుచున్నారు. కుమ్మరిసారెమీది కుండలవలె తిరుగుచున్నారు. కొండలమధ్యమున చిక్కుకొన్న జాత్యంధులవలె దారిగానక తిరుగుచున్నారు. ఎదపులులు అడ్డుకొన్న కుక్కలవలె వెనుకకు మరలుచున్నారు. వేసవికాలములోని తృణములవలెను, వృక్షములవలెను వాడిపోవుచున్నారు. కృష్ణపక్షమునందలి చంద్రునివలె కళావిహీనులగుచున్నారు. గరుడి పాలబడిన పాములవలె భక్షింపబడుచున్నారు. పెద్ద మొసలి పిల్లమొసలిని మ్రింగివేసినట్లు మ్రింగివేయబడుచున్నారు. దొంగలగుంపు వర్తకుల బిడారును దోచుకొన్నట్లు దోపిడి పాలవుచున్నారు. ఝంఝూమారుతమున పెద్దవృక్షములు విరిగిపడినట్లు విరిగిపడుచున్నారు. విష

జంతువుల కాటునకు గురియయినట్లు మరణించుచున్నారు. తేనెపూసిన కత్తులతో వలె నెమ్మదిగా నరకబడుచున్నారు. ప్రవాహములో ప్రాకుమొద్దులవలె కొట్టుకొనిపోవుచున్నారు. పసిపిల్లలు తమ మలమూత్రములతో ఆడుకొనునట్లు ఆడుకొనుచున్నారు. అంకుశము ఏనుగును మరలించినట్లు మరలింపబడుచున్నారు. ధూర్తులైన బాలురు బందెలో పడినట్లు, బందెలో పడుచున్నారు. జూదగాండ్రు తమ ధనమును కోలుపోయినట్లు వీరును తమ కుశలమూలములను నశింప జేసుకొనుచున్నారు. రాక్షసస్త్రీల పాలయిన వణిజులవలె వీరును భక్షింపబడుచున్నారు.''

ఈ విధమున రాజకుమారుడు ముప్పదిరెండు విధములుగా అంతఃపురమును పోల్చి శరీరము అశుభమైనదని తలపోసి, మనస్సున చర్చించుకొని, స్థిరబుద్ధితో ఒక నిశ్చయము చేసికొనెను. పిదప అతడు శయ్యామీదినుండి దిగి, సంగీతభవనమున తూర్పు ముఖముగ నిలచి, కుడి చేతితో రత్నగవాక్షమును వంచి, మేడచివరకు వచ్చి నిలచెను. పదిగోళ్లుచేరునట్లు రెండుచేతులు జోడించి, పూర్వబుద్ధులను స్మరించి, ఆకాశమువైపు చూచి, దైవబలమును తన కున్నదని నిశ్చయించుకొనెను.

అప్పుడు అర్ధరాత్రి సమయము. రాజకుమారుడు ఛందకుని పిలిచి, "ఛందకా, ఆలసింపకుము. వెంటనే అశ్వరాజమును అలంకరించి తీసుకొనిరమ్ము. ఇప్పుడు బయలువెడలిన నిశ్చయముగా కార్యసిద్ధియగును." అనెను.

ఛందకుడు ఆ మాటలకు కలతపడి "వికసించిన కమలదళలవలె శుభప్రదములైన కన్నులుగల రాజకుమారా? ఎక్కడికి వెళ్లుదువు?" అని ప్రశ్నించెను.

"ఛందకుడా, శీలము రక్షించుకొనుటకును, శాంతికొరకును నేను పూర్వజన్మములలో కరచరణ నయనాద్యవయవములను, శిరస్సును త్యాగము చేసితిని. తనయులను, భార్యను, ప్రియులను, ధనకనక నవరత్న పరిపూర్ణమైన రాజ్యమును కూడ త్యజించితిని. ఇక జరామరణము లను పంజరమున చిక్కుకొని బాధపడుచున్న ప్రాణులకు విడుదల కలిగించుట కిప్పుడు తగిన సమయము వచ్చినది." అని రాజకుమారుడు అనెను.

"రాజకుమారా, నీ శ్రేయస్సును కోరిన నా మాటలు వినుము. ఈ లోకమున పలువురు తమకు దేవమనుష్య సంపద యంతయును లభింపవలెనని కోరుకొందురు. దాని

కోసము వారు అనేక విధములైన వ్రతములు, తపములు చేయుదురు. అట్టి గొప్ప సంపద నీకు ఉండనేయున్నది. ఈ రాజ్యము నీది. ఇది సమృద్ధమై, సుభిక్షమై, క్షేమము గలదియై, విస్తారమై, రమణీయమై జనముతో కిటకిట లాడుచున్నది. ఈ రాజ్యమున పెక్కు ఉద్యానములున్నవి. పలువిధములగు పుష్పఫలములతో నిండిన వృక్షములు ఆ ఉద్యానములలో ఉన్నవి. ఆ చెట్లమీద అనేక విధము లయిన పక్షులు కలకలారావములు చేయుచున్నవి. ఉద్యాన వనములలోని కొలకులు పద్మములు, నల్లకలువలు, ఎఱ్ఱ కలువలు, తెల్ల తామరలతో శోభాయమానముగ నున్నవి. తీయమామిళ్లు, సంపెంగలు, అశోకములు, గోరింటలు, తిలక వృక్షములు కొలకుల గట్లపైనున్నవి. సుందరభవనములు ఆయా ఋతువులకు తగినవి ఉన్నవి. నీ అంతఃపురము తూణవము, పణవము, వీణ, వేణువు, సంప్రతాడము, నకులము, సుఘోషకము, మృదంగము, పటహము మొద లయిన నృత్యగీత వాద్యముల సంగీతములతో వినోదముగా నున్నది. దేవా, నీవు యువకుడవు. పరిపూర్ణయౌవనము కల వాడవు. కోమల శరీరము కలవాడవు. సుఖములను బాగుగ అనుభవించిన వాడవు కావు. సహస్రనయనుడు, అమ రాధిపుడు అయిన దేవేంద్రునివలె సమస్త భోగములును బాగుగ అనుభవింపుము. వృద్ధుడయిన మీదట అభినిష్క్ర మణము చేయవచ్చును. నేనును నీతోపాటు అభినిష్క్ర

మణము చేయుదును.'' అని ఛందకుడు ఎంతయో వినయ ప్రేమములతో విన్నవించెను.

అప్పుడు రాజకుమారుడు విసుగుతో ''ఓయీ ఛందకా, ఇక చాలు. ఊరుకో. అనంతమైన ఈ జగత్తు సంసారమను మహాప్రవాహమున కొట్టుకొని పోవుచున్నది. నేను త్యాగము, శీలము, వ్రతము, శాంతి మున్నగువాని బలమను దారువులతో, వజ్రదృఢములగు అధ్యాశయముల కట్లతో దృఢమైన ధర్మమను నావను ఎక్కి అనంతమైన ఈ జగత్తును తరింపజేయుదును. ఇదియే నా నిశ్చయము. ఇది ముక్తికొరకును, సత్యముకొరకును ఏర్పడినది. అవ్యయమైనది. మేరుపర్వతమువలె చలనములేనిది. వజ్రాయుధము వంటి పిడుగు తలపై పడినను, మరుగుచున్న ఇనుము మీాద పడినను, కొండశిఖరములు విరిగి వెన్నునపడినను నేను మాత్రము గృహముమీాది వాంఛను మరల పొందను.'' అనెను.

అప్పుడు ఆకాశమున ఉన్న దేవతలు కిలకిలధ్వనులు చేయుచు, అతనిపై పుష్పవర్షము కురిపించిరి. ''మహాబుద్ధిశాలీ, లోకమునకు అభయ మొసగిన నాయకుడా, విజయము పొందుము. జయహే!'' అని నినాదముచేసిరి.

ఛందకుడు ఇక చేయునదేమియును లేక విలపించుచు కంటకమను పేరుగల అశ్వమును సన్నద్ధముచేసి తీసికొని వచ్చెను. అది పూర్ణచంద్రునివలె తెల్లగ ప్రకాశించు

చుండెను. దాని బంగరుగిట్టల కాంతి మెరపువలె నుండెను. రాజకుమారుడు ఆ కంటకాశ్వమును అధిరోహించి బయలు దేరెను.

అతడు వెళ్ళిపోవుచుండగా కపిలవస్తునగరాధిదేవత దీనమయిన మనస్సుతో వచ్చి, కరుణ యుట్టిపడునట్లు ఇట్లు పలికెను: "ఓ మహాభాగా, నీవు లేకపోయిన ఈ నగరము ప్రకాశింపదు. చీకటి వ్యాపించినట్లున్నది."

మహామతిమంతుడగు రాజకుమారుడు నగర దేవత మాటలను వినెను. "జన సమూహామును జరామరణ బాధలనుండి తప్పించుమార్గము తెలిసికొనుదాక నేను కపిలవస్తునగరమును మరల ప్రవేశింపను. హృద్యమైన అజరామరపదమును పొందక కపిలవస్తువుముఖము చూడను; ఆసనశయనముల స్వీకరింపను." అని నిశ్చయించుకొనెను. అతడు నగరునుండి నిష్క్రమించుచున్న సమయమున అంబరవీధిలో అప్సరసలు స్తుతించిరి.

అతడు అభినిష్క్రమణము చేసి, శాక్యులను దాటుకొని, అంతర్గృహములను అతిక్రమించి, మల్లులను తప్పించుకొని ఆరు యోజనములదూరము వెళ్లినప్పటికి తెల్లవారెను. అప్పుడతడు కంటకాశ్వమునుండి దిగి, భూమిమీద అడుగు పెట్టెను. తర్వాత తన ఆభరణములను తీసి ఛందకునికి ఇచ్చి, కంటకాశ్వమునుకూడ అప్పగించెను. ఛందకుడు

మారుమాటాడక వానిని తీసికొని నగరమునకు మరల పోయెను. ఛందకు సిద్ధార్థుని వదలి వెళ్లిన స్థలమునకు "ఛందక నివర్తనము" అను పేరు వచ్చినది.

పిదప సిద్ధార్థ రాజకుమారుడు "జుట్టుతో సన్న్యసించుట యెట్లు?" అని ఆలోచించి, కత్తితో తన కేశములను ఖండించి అంతరిక్షమున విసరివేసెను. దానిని ముప్పది ముగ్గురు దేవతలు పట్టుకొని పూజకొరకై భద్రపరచిరట. ఈ స్థలమునకు "చూడా పరిగ్రహస్థలము" అని ప్రసిద్ధి కలిగినది.

అనంతరము సిద్ధార్థుడు తాను ధరించిన పట్టుబట్టలు చూచుకొనెను. "వీనితో సన్న్యసించుట యెట్లు? వనవాసమునకు తగిన కావిబట్టలు లభించిన బాగుండును." అని అతనికి తోచెను. అప్పు డతనికి వేటకు పోవుచున్న బోయ యొకడు కనిపించెను. రాజకుమారుడు అతనితో "ఓయీ, నీవు నీ కావిగుడ్డలను నాకు ఇచ్చివేసినయెడల నీకీ పట్టుబట్టలు ఇత్తును" అనెను. లుబ్ధకుడు "అయ్యా, నీకు పట్టువస్త్రములే తగినవి. నాకీ కావిబట్టలే తగినవి" అనెను. రాజకుమారుడు అతనిని యెట్లో బ్రతిమాలి, తన వస్త్రములు అతనికిచ్చి, అతని కావిబట్టలు పుచ్చుకొని ధరించెను. ఆస్థలము "కాషాయ గ్రహణము" అని ఖ్యాతిపొందెను.

రాజకుమారుడు ఇట్లు శిఖను ఛేదించుకొని, కాషాయములు ధరించి ముందుకు నడచిపోయెను.

## ౧౭

ఇట కపిలవస్తు నగరమున రాచనగరులో నునికి పాట్లు పడుచున్న స్త్రీలలో కొందరికి మెలకువ వచ్చెను. కన్నులు తెరచి చూడగా రాజకుమారుడు కనిపింపలేదు. వారు మిగుల ఆందోళనపడి, వేసవిభవనమును, వర్షాకాల భవనమును, శీతకాల భవనమును వెదకిరి; కాని అతని జాడలు తెలియలేదు. నలుగురును నాలుగువైపులకు పోయి, ఆసనములను, గృహములను గాలించిరి. అందరును ఒక్కచోట గుమిగూడి ఆడుగొర్రెలు అరచినట్లు విలపించిరి. “హా! తండ్రీ!” “హా నాథా!” “అయ్యో సోదరా!” “హా! స్వామీ!” అని నానా విధములగు ప్రియవచనములు పలుకుచు ఏడ్వసాగిరి. కొందరు ఒకరిపైన ఒకరుపడి, కొందరు తలలు బాదుకొనుచు, కొందరు ఒకరు ముఖము నొకరు చూచుచు రోదింపసాగిరి. కొందరు కన్నులు తుడుచుకొనుచు, కొందరు కన్నులు త్రిప్పుకొనుచు, కొందరు గుడ్డతో ముఖము కప్పుకొని గుండెలు బాదుకొనుచు, తొడలు తాటించుకొనుచు, భుజములను కొట్టుకొనుచు, తలలు వంచుకొని, తలమీద దుమ్ము చల్లుకొనుచు, జుట్టు విరియబోసుకొని, జుట్టు పీకుకొనుచు, చేతులు పైకెత్తి విలపింపదొడగిరి. కొందరు

అమ్ములు తగిలిన జింకలవలె పరుగిడుచు దుఃఖించిరి. కొం దరు గాలికి ఊగిసలాడు అరటి చెట్టువలె కంపించుచు ఏడ్చిరి. కొందరు వలనుండి తీసి నేలమీద పడవేసిన చేపలవలె కొనఊపిరితోను, కొందరు మొదలు నరకిన మ్రాకులవలె నేలపై కూలి వాపోవ దొడగిరి.

ఆ సమయమున శుద్ధోదన మహారాజు నిద్రపోవు చుండెను. స్త్రీల ఆర్తనాదము విని అతనికి తెలివివచ్చెను. అతడు శాక్య వీరులను పిలిపించి "అంతఃపురమున పెద్దగా గోల జరుగుచున్నది. ఏమి కారణము?" అని ప్రశ్నించెను. "మహాప్రభూ, రాజకుమారుడు అంతపురమున కానవచ్చుట లేదు. అందువలన గోలగా నున్నది" అని వారు సమా ధాన మిచ్చిరి. శుద్ధోదనుడు మిగుల ఉద్విగ్నుడై "కుమా రుడు వెలుపలికి పోకుండ నగరద్వారము లన్నిటిని మూసి వేయుడు. అట్లు మూసివేసిన కుమారుని వెదుకవచ్చును. త్వరపడుడు" అని ఉత్తరువు చేసెను.

రాజకుమారుని పెంచి పెద్దజేసిన మహాప్రజాపతి గౌతమి శాక్యుల మాటలు విని దుఃఖ భరముతో తెలివితప్పి నేలమీదపడి మూర్ఛిల్లినది. తెలివి వచ్చినపిదప ఆమె మహారాజుతో "మహాప్రభూ, త్వరగా కుమారుడు నాకడకు వచ్చునట్లు చేయుడు." అని ప్రార్థించెను,

అప్పుడు రాజకుమారుని వెదకుట ఆరంభమాయెను.

శాక్యులు రాజభవనములలోపలను, వెలుపలను వెదకిరి. ఎంత వెదకినను అతడు కనబడలేదు. అతనిని వెదకుటకు నలు దిక్కులకును గుర్రపురౌతులను పంపించిరి. "మీరు వెదకుడు. రాజకుమారుడు కనబడిననే మీరు తిరిగిరండు." అని మహా రాజు గట్టి కట్టడి చేసెను.

జ్యోతిశ్శాస్త్ర వేత్తలు, శకునజ్ఞులు బాగుగ ఆలో చించి మంగళద్వారమునుండి అతడు వెళ్లియుండునని నిశ్చ యించిరి. అన్వేషకులు ఆ ద్వారమువైపు వెళ్ళగా, అక్కడ పూలవాన పడినట్లు కనిపించెను. ఆ మార్గముననే రాజకుమారుడు వెళ్లియుండునని వారు నిర్ణయించిరి. వారు ఆ దారిని వెదకుచు పోవుచుండగా, రాజకుమారునికి తన కాషాయ వస్త్రములు ఇచ్చిన లుబ్ధకుడు కనిపించెను. అతని తలపై రాజకుమారుడు ధరించిన పట్టుబట్టలుండెను. ఆ బట్ట లను చూచువేళకు అన్వేషకులయిన శాక్యులకు "ఈ బోయ విలువయిన వస్త్రములకోసము రాజకుమారుని తుద ముట్టించి యుండడు గదా!" అని సందేహము కలిగెను. అందువలన వారు "వీనిని పోనివ్వకుడు! పట్టుకొనుడు!" అని కేకలు వేయదొడగిరి. ఇంతలో ఛందకుడు వారికి కాన వచ్చెను. అతడు రాజకుమారుని ఆభరణములు ఒక చేతితో పట్టుకొని, రెండవ చేతితో కంటకాశ్వమును పట్టుకొని నడ పించుకొనుచు వచ్చుచుండెను. అది చూచి శాక్యులు

"బోయ విషయమున తొందరపాటు వలదు. ఛందకుడు వచ్చుచున్నాడు గదా! అతనిని అడిగి సంగతి యేమియో తెలుసుకొందము" అని భావించి ఛందకునివద్ద చేరిరి.

"ఓ ఛందకుడా, వీడు ఈ పట్టు వస్త్రములకొరకై రాజకుమారుని చంపియుండలేదు కదా?" అని వారు అతనిని ప్రశ్నించిరి. "మీరు తలచినది సరికాదు. అతడు రాజకుమారునికి తన కాషాయములు ఇచ్చెను. రాజకుమారుడే తన పట్టువస్త్రములు ఇతనికి ఇచ్చెను."అని ఛందకుడు వారికి సమాధానమిచ్చి, రాజకుమారుడు లోకోత్తర సమ్యక్సంబోధిని సాధించినగాని కపిల వస్తు నగరమునకు తిరిగి రానని దృఢ నిశ్చయముతో వెళ్ళినాడని, వెదకుటవలన ప్రయోజనము లేదని నచ్చజెప్పి, శాక్యులను నగరమునకు మరలించెను.

తరువాత ఛందకుడు కంటకాశ్వమును, ఆభరణములను తీసికొని అంతఃపురము ప్రవేశించెను. వానిని చూచి మహాప్రజాపతి గౌతమి, తక్కిన అంతఃపురాంగనలు చాల దుఃఖించిరి. "ఈ ఆభరణములను చూచుచుండిన నా హృదయమున శోకము రగులుచున్నది. కనుక వీనిని పుష్కరిణిలో పడవేయుటమేలు!" అని గౌతమి భావించి వానిని పుష్కరిణిలో పడవేసెను. ఆ పుష్కరిణికి నేటికిని "ఆభరణ పుష్కరిణి" అని పేరు.

మహారాజు శుద్ధోదనుడు కంటకాశ్వమును, ఛంద కుని చూచి, గట్టిగా అరచి నేలపై కూలిపోయెను. తర్వాత కొంచెము సేపటికి తెలివితెచ్చుకొని, "హా! కుమారా! గీతవాద్యములతో వినోదించుచు కుశలముతో నున్నవాడవు సమస్తరాజ్యమును వదలి ఎక్కడికి పోయితివి? ఓయీ ఛందకా! నాకు వివరముగా చెప్పుము. రాజకుమారుడు ఎక్కడికి వెళ్లినాడు? ఏ విధముగా వెళ్లినాడు? అతడు వెళ్లుటకు నగరద్వారములు ఎవరు తెరచిరి?" అని ప్రశ్నించెను.

ఛందకుడు వినయముతో ఇట్లు విన్నవించెను! "పార్థి వేంద్రా, సావధానముగా వినుడు. నగరము మాటు మణగి ఆబాలవృద్ధము నిద్రపోవుచున్నప్పుడు, రాజకుమారుడు నావద్దకు వచ్చి, నెమ్మదిగను, మధురముగను కంటకాశ్వ మును తెమ్మని కోరెను. నే నేమి చేయగలను? ఆతని కోరిక ననుసరించి, ఏడ్చుచునే గుర్రమును తెచ్చితిని. యంత్ర బద్ధమైన నగరద్వారమును ఇంద్రుడే తెరచెను. నలుగురు లోకపాలకులు ఆ గుర్రము కాళ్లను పట్టుకొనిరి. ఆయన ఏ మార్గన వెళ్లినదియు ఎవ్వరికిని తెలియదు."

పిదప ఛందకుడు గోపాదేవి మందిరమునను వెళ్లెను. గోప గుర్రమును, ఛందకుని చూచి, మూర్ఛవచ్చి నేలపై పడిపోయెను. అక్కడనున్న పరివారజనము చల్లని నీరు తెచ్చి

ఆమె ముఖముపై చల్లిరి. ఆమె కొంచెము తెప్పరిల్లి, లేచి కంటకాశ్వము కంఠమును కౌగలించుకొని, వెనుకటి తన సుఖానుభవములను తలచుకొనుచు,

"హా! మహ్యా ప్రీతిజననా!
హా! మమ నరపుంగవా! విమలచంద్రముఖా!
హా! మమ సురూపరూపా!
హా! మమ వరలక్షణా! విమల తేజధరా !"

అని హాహాకారములతో విలపించెను.

"ఉత్తమజాతిలో పుట్టిన కంటకాశ్వమా, నీవు నా భర్తకు ఎల్లప్పుడును సహచరమై ఉన్నావు. ఆయనను ఎక్కడ వదలివచ్చితివి? ఛందకుడా, నీకు కరుణయనునది లేదా? నరవరుడైన నాభర్త వెళ్లిపోవుచుండగా, వెళ్ళ గూడదని బోధింపనైన బోధింపకపోతివి. ఛందకుడా, సమస్త జనులను, తల్లిదండ్రులను వదలివెళ్లినప్పుడు మావంటి స్త్రీలప్రేమసంగతి అతనికి లెక్కయేమి? అయ్యో! ఇష్టులు దూరమైన కలుగు కష్టము ఎంత దుర్భరమయినది? అంతయును రంగముపై నటుని ప్రదర్శనమువలె అస్థిరముగా నున్నదే! సంబోధిని తెలిసికొని, కోరిక తీరినపిదప తిరిగి రాగలరనుమాట విని కొంత సంతృప్తి కలుగుచున్నది." అని గోప వాపోయెను.

ఛంచకుడు గోపాదేవి దీనవచనములు విని కన్నీరు

ధారలు గట్టగా, కంఠమునుండి మాటరాకపోగా నెమ్మదిగా ఇట్లనెను : "రాజకుమారీ, గోపాదేవీ! నా మాట శ్రద్ధతో వినుమని ప్రార్థించుచున్నాను. రాత్రి సగము గడచినది. పుణ్యశతములవల్ల జన్మించిన రాజకుమారుడు కంటకాశ్వము సిద్ధముచేసియుంచుమని నన్ను కోరెను. ఆసమయమున అంతఃపురముననున్న స్త్రీలందరును గాఢనిద్రలో నుండిరి. నేను నీకొరకై చూడగా నీవును నిద్రపోవుచుంటివి. నేను నీ వద్దకు వచ్చి గట్టిగా 'అమ్మా, శీఘ్రముగా లేవవలెను. నీ ప్రియుడు ఇల్లువీడి వెళ్లిపోవుచున్నాడు' అని యంటిని. నా మాటలు నీకు వినబడకుండ దేవతలే ఏదో తంత్రము చేసిరేమో! ఒక్క యువతియును నామాటలు విని మేల్కొనలేదు. నేను ఏడ్చుచునే కంటకాశ్వమును సన్నద్ధముచేసి రాజకుమారునికి అప్పగించితిని. కంటకాశ్వము కూడ ఎంతయో ధ్వనితో సకిలించినది. ఆ సకిలింపు కోసు దూరము వినిపించినది. అయినను అది నగరములో ఎవ్వరికిని వినిపింపలేదు. కంటకాశ్వము గిట్టలధ్వనిని ఎవ్వరును విన లేదు. అంతయును దేవమాయ! కనుక గోపాదేవీ, విచా రింపకుము. సంతోషముతో ఉండుము. నీ భర్త బోధినిపొంది దేవతలవలన మన్ననపడసి త్వరలో తిరిగిరాగలడు. అమ్మా, సుకృతకర్మలు చేసినవారు ఎంతమాత్రమును దుఃఖంప రాదు. నీ భర్త లోకహితార్థము వెళ్లినాడు. ఆ లోకహితము నీవు చేసినట్లే భావించి నిర్విచారముగ నుండుము."

౧౮

అక్కడ రాజకుమారుడు లుబ్ధకునివద్ద కాషాయ వస్త్రములు తీసికొని ధరించి ప్రయాణము సాగించెను. దారిలో అతడు ఒక శాక్యబ్రాహ్మణి తపస్సుచేయుచున్న ఆశ్రమమునకు వెళ్లెను. ఆమె అతనికి నివాసమిచ్చి ఆతిథ్యముతో గౌరవించెను. పిదప అతడు పద్మ అను బ్రాహ్మణి తపమాచరించు ఆశ్రమమునకు వెళ్లెను. ఆమెయును అతనిని ఆతిథ్యముతో సత్కరించెను. అట్లే అతడు రైవతకుడను బ్రహ్మర్షి ఆశ్రమమును, రాజకుడను మహర్షి ఆశ్రమమును దర్శించి సంచరించుచు క్రమముగ వైశాలీనగరమును చేరెను. అక్కడ అతడు కలాపమను వేదశాఖను ఎరిగిన ఆరాధుడు అను తపస్వివద్ద కొంతకాలము తపమాచరించి మగధదేశమునకు బయలువెడలెను.

రాజకుమారుడు మగధదేశమున సంచరించుచు మాగధుల రాజధానియయిన రాజగృహనగరమును సమీపించెను. భిక్షాపాత్ర గ్రహించి భిక్షకోసము రాజగృహమున ప్రవేశించెను. బంగారుచాయతో మెరసిపోవుచున్న అతనిని చూచి • అందరును ఆశ్చర్యపడదొడగిరి. నగరమునందలి జనులు తమతమ పనులు మానుకొని మేడలమీదను, ద్వార

ప్రదేశములయందును, వాతాయనములకడను గుమిగూడి చూడదొడగిరి. విపణులలో క్రయవిక్రయములు ఆగిపోయెను. పానశాలలలో మద్యపానము చేయువారు పానము మానివేసిరి. కొందరు రాజపురుషులు వేగముగా రాజభవనమునకు పోయి బింబిసార మహారాజునకు ఈ విషయము తెలియ జేసిరి. ''రాజా, నీవెంతయును అదృష్టవంతుడవు. నీకు గొప్ప లాభము కలిగినది. బ్రహ్మదేవుడే వచ్చి నీ నగరమున భిక్షాటనము చేయుచున్నాడు'' అని విన్నవించిరి.

ఆ మాటలు విని బింబిసారుడు మిక్కిలి కుతూహలముతో తన సౌధముమీది గవాక్షముపై కూర్చుండి ఆ సన్న్యాసిని చూచి, బంగారువలె మెరసిపోవుచున్న అతని తేజస్సునకు మిక్కిలి ఆశ్చర్యపడెను. అతనికి భిక్షయిచ్చి, అతడు ఎచ్చటికి వెళ్లునో, నివాస మేదియో తెలిసికొనుమని ఒక రాజపురుషునికి ఆజ్ఞాపించెను. ఆ రాజపురుషుడు రాజకుమారుని వెన్నంటి వెళ్ళి, అతడు నగరము వెలుపలనున్న పాండవశైలమను కొండకు వెళ్లుట చూచి, బింబిసారునికి ఆ సంగతి నివేదించెను.

రాత్రి గడచెను. తెల్లవారెను. బింబిసారుడు పరివారముతోను, నగరజన సమూహముతోను పాండవశైలమునకు బయలుదేరెను. కొండ అడివారమున రాజకుమారుడు తేజస్సుతో వెలుగుచు, తృణములను ఆసనముగా వేసికొని, స్వస్తికాసనమున ఆసీనుడై మేరుపర్వతమువలె నిశ్చల

ముగా నుండెను. బింబిసారుడు అతని పాదములదగ్గర తల యుంచి నమస్కరించి, పెక్కు విషయములను ముచ్చటించిన పిదప, "మహాశయా, నా సమస్తరాజ్యమును నీకు ఇచ్చివేయుదును. నా రాజ్యమును పాలింపుము. నీవు చిన్నవాడవు" అని ప్రార్థించెను.

రాజకుమారుడు అతనిమాటలు విని "రాజా, నీకు నిత్యము జయ మగుగాక! నాకు సుఖములపై ఎంతమాత్రమును అభిలాష లేదు. పులిసిపోయిన చలిదియన్నమును వదలినట్లు సుఖములను వదలివేసితిని. శుభకరమైన జ్ఞానమును పొందదలచి ఇల్లువదలి వచ్చితిని." అనెను.

"భిక్షూ, నీవు ఏ దిక్కునుండి వచ్చితివి? నీ జన్మస్థలము ఎక్కడ? తల్లిదండ్రు లెవరు? నీ కుల మేది? చెప్పుటకు కష్టము లేకున్న వివరముగా చెప్పుము." అని రాజు ప్రశ్నించెను.

"రాజా, శాక్యులపేరు నీవు వినియుందువు. సర్వసమృద్ధమైన కపిలవస్తువు అను నగరము వారికి రాజధాని, దానిని పాలించుచున్న శుద్ధోదనుడు నా తండ్రి. గుణముల మీద అభిలాష కలుగుటచే సన్యసించితిని." అని రాజకుమారుడు తెలిపెను.

బింబిసారుడు మిగుల సంతోషించెను. "నీవు సమ్యక్సంబోధిని సంపాదించినట్లయిన, ఆ దానిని నాకును ఉపదేశింపుము." అని ప్రార్థించి అతడు సిద్ధార్థునికి ప్రదక్షిణ నమస్కారములు ఆచరించి రాజగృహమునకు మరలెను.

౧౯

ఆ కాలమున రుద్రుడను యోగి రాజగృహ సమీపమున ఏడువందలమంది శిష్యులతో నుండెను. సిద్ధార్థుడు అతనివద్ద కొంతకాలముండి, భద్రవర్గీయులను ఐదుగురితో పాటు మగధ దేశమున సంచరింపసాగెను. ఆ సంచారమున గయకు వచ్చి, నైరంజనానది తీరమును చేరెను. ఆ నదీ తీరము తరుగుల్మలతాదులతో అందముగనుండెను. దానిచుట్టుపట్టుల పెక్కు గ్రామములు కానవచ్చెను. "ఈ ప్రదేశము సమతలమై మిగుల రమణీయముగనున్నది. ప్రతిసంలయనమునకు అనుకూలము. ధ్యాననియమము కోరు కులపుత్రునికి ఇది సరియగు స్థలము. నేనిక్కడనే నివసించి నా తపము సాగింతును" అని అతడు భావించుకొనెను. పిదప అతడు ఆరుసంవత్సరములు దుష్కరాతిదుష్కరమైన తపస్సును అవలంబించెను. అతడు నువ్వుగింజంత, బియ్యపుగింజంత ఆహారము పుచ్చుకొని, ఆహారము పుచ్చుకొనక తపమాచరించెను. అతని శరీరము కృశించిపోయెను. అంగములన్నియు నీలిచెట్టు కర్రలవలె కానవచ్చెను. ప్రక్క యెముకలు ఎండ్రిప్రక్కభాగములవలె ఆయెను. వాహనములశాలగాని, గజశాలగాని ప్రాతదయి, కప్పు ఎగిరి

పోయినప్పుడు వాసములు, మూజానుపట్టెలు ఉన్నట్లు అతని ప్రక్క ఎముకలు కానవచ్చినవి. బాట మిట్టపల్లములు పడి నప్పుడున్నట్లు వెన్నెముక ఉన్నతావనతముగ నుండినది. తల ఎండిపోయిన లేత చేదుసొరకాయవలె నొక్కుకొని పోయెను. వేసవికాలమున చివరినెలలో నూతులలోని ఒరలు దూరదూరముగా పోవుచున్నట్లు కనుగ్రుడ్లు చాల లోతునకు పోయినవి. కక్షములు, కుక్షి, వక్షము అజపదమువలెను, ఉష్ట్రపదమువలెను ఆయెను. కుక్షిని తాకిన వెన్నును తాకినట్లు ఉండెను. లేచుటకు ప్రయత్నించి వంగి అట్లే ఉండెడివాడు. లేవలేక పడిపోవుచుండెను. అత్యంత కష్టముతో శరీరముమీది దుమ్మును దులుపుకొనగా, శరీరముమీది రోమములు రాలిపోవుచుండెను. శరీరకాంతి నల్లబారినది. సమీపగ్రామముల జనులు అతనిని చూచి, "అయ్యో గౌతమశ్రమణుడు ఎట్లు నల్లబడిపోయినాడు? నీటికాకివలె నయినాడు" అని విచారపడుచుండిరి. దగ్గరిగ్రామముల బాలబాలికలు, గొల్లపిల్లలు, గడ్డికోసికొనుటకు వచ్చినవారు, కట్టెలు కొట్టుకొనువారు, పేడకు వచ్చినవారు అతనిని పాంశుపిశాచ మని అనెడివారు; అతనిపై దుమ్మెత్తిపోసెడివారు. ఇట్లు గౌతముడు ఆరేండ్లు దుష్కరచర్య అవలంబించి, మిగుల దుర్బలశరీరుడాయెను.

గౌతముడు దుష్కరచర్య చేయుచున్నప్పుడు, సమీపగ్రామమునకు అధిపతి యయిన నందికుని పుత్రి

సుజాత యనుకన్య గౌతముని తపస్సుచూచి, అది ఫలింప వలెనని వ్రతము చేయుచుండెను. గౌతముడు ఆరుసంవత్సర ములపాటు దుష్కరచర్యాతపము జరిపిన తర్వాత ఈ విధముగా తలపోసెను: "నేను జ్ఞానము పొందిన వాడనయి నప్పటికిని, దేహము మిగుల కృశించినది. ఈ దేహముతోనే సర్వజ్ఞత్వము సంపాదించుకొనుటకు ప్రయత్నించుట తగదు. మంచి భోజనము భుజించి, దేహమున బలము సంపాదించు కొని, తపమునకు పూనుకొందును. దుర్బలు లైనవారు దుర్బలకాయముతో అమృతము తెలుసుకొనలేరు."

గౌతముడు ఇట్లు తలపోసి, నెమ్మదిగా లేచెను. దుష్కరచర్యా సమయమున అతని కాషాయ చీవరములు చినిగిపోయెను. అతడు మిగుల శ్రమముతో సమీపముననున్న శ్మశానమునకు వెళ్లి ఒక శవమునకు చుట్టిన మురికి జనప నారపట్టను ఎడమకాలితో నొక్కిపట్టి లాగి తీసికొని, పాణిహతాపుష్కరిణియను పుష్కరిణిలో దానిని ఉతికి, బొంతగ కుట్టుకొని, కట్టుకొనెను. తరువాత నైరంజనా నదికి వచ్చి, స్నానమొనర్చి అలసట తీర్చుకొనుటకు ఇసుక గట్టుపై కూర్చుండెను.

ఆనాడు సుజాత తన వ్రత పూర్తియగుట వలన పాయసము వండి గౌతమునికి నివేదించదలచెను. ఆమె పాలు పితికి కాచి, ఏడుమార్లు మీగడతీసి, ఆ మీగడతో క్రొత్త

బియ్యమును క్రొత్తపాత్రములో పోసి, క్రొత్తప్రొయ్యి అలికి నిప్పు ముట్టించి పాయసము వండెను. పరమాన్నము పక్వమయిన పిమ్మట, స్థండిలము కల్పించి, దానిపై పూవులు చల్లి, గంధోదకము చిలుకరించి, ఆసనము ఏర్పాటుచేసి గౌతముని ఆవాహనముచేసి పూజించి, మధుపాయస భాజనముతో నైరంజనానదికి వచ్చి, గౌతముని ముందు స్వర్ణమయపాత్రలో మధుపాయసము నర్పించి "నా సారథీ, ఈ పాయసము ఆరగింపుము" అని కోరెను. యావదర్థాపేక్ష (అక్కర లేని దానికంటె ఎక్కువకోరని) ఆ మునిముఖ్యుడు పాయసము భుజించి భోజనపాత్రమును నీటిలో విసరివేసెను. దానిని పురందరుడు పట్టుకొని పూజకోసము భద్రపరచుకొనెను.

పోదారకమైన మంచి ఆహారము భుజించుటవలన అతనికి మునుపటివలె దేహబలము తేజశ్శ్రీలో చేకూరెను. అతడు సుజాతకు ధర్మోపదేశముచేసి ఋణముతీర్చుకొని, బోధిద్రుమము చేరి, తృణ సంస్తరముపై పూర్వాముఖముగ పర్యంక బంధమున కూర్చుండి, శరీరము ఋజువుగ నుండునట్లు ప్రణిధానముపొంది, "నా శరీరము ఈ ఆసనము లోనే యెండిపోవును గాక! చర్మము, అస్థి, మాంసము నశించి నను నశించుగాక! బహుకల్పదుర్లభమైన సమ్యక్సంబోధిని పొందక ఈ ఆసనమునుండి శరీరమును కదలింపను" అని దృఢ ప్రతిజ్ఞ చేసెను.

## ౨౦

గౌతముడు ఇట్లు తపము ప్రారంభింపగా, మారునికి ఈర్ష్య జనించి, అతని తపమునకు విఘ్నము కలిగింపవలె నను దుష్ట సంకల్పము కలిగెను. అతడు తన పరివారమును సమావేశపరచి ఇట్లు నుడివెను: "గౌతముడు బోధినిపొంది బుద్ధుడయినచో, కోటానుకోటి ప్రాణులకు బోధి కలిగించును. అతడు ప్రపంచమునకు శాంతి చేకూర్చు అమృతత్వము పొందెనా, నా భవనము శూన్యమగును. కనుక మన మంద రము గొప్పబలముతో అతనివద్దకు వెళ్ళి, ద్రుమరాజము క్రిందకూర్చున్న ఆ శ్రమణునిపై దాడిజరుపుదము. నాకు మీరు ప్రియము చేకూర్చదలచిన, త్వరగా చతురంగ సైన్యము సిద్ధపరచుడు."

మారుని పరివారమున సార్థవాహు డనువాడు ఉండెను. అతడు మారునితో "ఆర్యా, మనబలము చాల విస్తారమయినదే. కాని, చాల దుర్బలమయినది. గౌతము డేమో రణంజయుడైన ఏకైకశూరుడు. మిణుగురుపురుగులు మూడు వేలున్నను ఒక్కసూర్యుని ముందు వెలవెలపోవును" అని విన్నవించెను.

మారుడు తన పరిజనులు ఎంత చెప్పినను వినలేదు. గొప్ప చతురంగబలము సమకూర్చుకొని, గౌతమవిజయ

మునకు బయలు దేరెను. ఆ బలమును తలచుకొనిన నే దేహము గగుర్పొడుచును. సైనికులు పెరవారికి భయముగొలుపుటకై దేవతలరూపమునను, మానవరూపమునను, వివిధవికార ముఖములతోను ఉండిరి. కొందరు సైనికులు పాములను కక్కుచుండిరి; కొందరు పాములను తినుచుండిరి. కొందరు సముద్రమునుండి గరుడి ఎగిరినట్లెగిరి మానవుల మాంస మును, రక్తమును, కరచరణశిరస్సులను, కాలేయమును, పేగులను తినుచుండిరి. కొందరు పచ్చగాను, మండిపోవు చున్నట్లున్న ఎఱ్ఱరంగుతోను, నల్లగాను, నీలముగాను, కద్రుకరాళరూపమునను నుండిరి. కొందరి కడతలలు వికారముగనుండెను. కొందరి కనుబొమలు మండుచు పెక లించుకొని వచ్చుచున్నట్లు ఉండెను. కొందరి కన్నులు గిర గిరతిరుగుచున్నట్లు ఉండెను. కొందరు మండుచున్న పర్వత ములను చేతితో పట్టుకొని మరొకకొండపై విసరుచు వచ్చిరి. కొందరు వేళ్ళతో చెట్లు పెకలించి గౌతమునివైపు పరువులిడిరి. కొందరు మేకచెవులవారు, చేటచెవులవారు, ఏనుగుచెవులవారు, పందిచెవులవారు, వ్రేలాడుచున్న చెవుల వారు, చెవులులేనివారు, పెద్దకడుపువారు, ఎముకలగూడు వంటివారు, చప్పిముక్కువారు, కుంభోదరులు, కరోట పాదులు, చర్మమాంసరక్తములు ఎండిపోయినవారు, చెవులు తెగినవారు, ముక్కుతెగినవారు, పగిలిన కాలుసేతులు కన్నులు తలగలవారు, బొంగురుగొంతువారు, వికారధ్వని

వారు, భయంకరధ్వనివారు, రూక్షధ్వనివారు, వివిధాయుధ ధారులు నగు వీరందరును "పట్టుడు! చంపుడు! కొట్టుడు! కట్టివేయుడు! చీల్చివేయుడు! పగులగొట్టుడు! తొక్కుడు! విసిరివేయుడు! నలిపివేయుడు—ఆ బోధిద్రుమముతో పాటు శ్రమణకుని!" అని కేకలు వేయుచు నడువసాగిరి.

వీరందరును మెరపులవర్షము, పిడుగులవర్షము, మండుటిసుకవాన కురిపించుచు, కాలమేఘములు సృష్టించుచు, ప్రళయ ప్రభంజనములు కల్పించుచు, కాళరాత్రి కలుగజేయుచు, పెద్ద ధ్వనులుచేయుచు గౌతమునివైపు పరుగులు తీసిరి. కొందరు పాశములు త్రిప్పుచు, పెద్దగ నవ్వుచు, రొమ్ము కొట్టుకొనుచు, సిగలు విదలించుకొనుచు గౌతముని బెదరగొట్టుటకు యత్నించిరి. కొందరు వృద్ధస్త్రీల వేషమున ఏడ్చుచు గౌతముని సమీపించి "అయ్యో! నాయనా! హా! నా కుమారా! లే! లే! త్వరగా పరుగెత్తిపో!" అని అర్చ నాగిరి. ఈవిధముగ మారుని సేన బోధివృక్షమును చుట్టుముట్టెను.

అప్పుడు గౌతముడు మారుని దుర్బలునిచేయుటకు వికసిత కమలసదృశమైన తన ముఖమును అటునిటు త్రిప్పి చూచెను. అతనిచూపు పడగనే మారుడు పరుగెత్తసాగెను. "నా సేన గౌతముని ముఖమున అణగిపోయినది" అని అతడు భావించుచు పరుగులిడుచు దూరమునుండి గౌత

మునిపై వివిధాయుధములను వదలెను. అవి యన్నియును అతనిపై పడి పూవులవలె నాయెను.

పిదప గౌతముడు కుడిచేయియెత్తి కరతలముతో తల నిమురుకొనెను. మారు డది చూచి, అతని చేతిలో ఖడ్గమున్న దేమో యని భయపడి మరల పరుగులిడెను. మరల తేరిపారజూచి ఏమియును లేదనుకొని మరలివచ్చి భయంకరాయుధములు విసరెను. అవి యన్నియును నానావిధ పుష్ప మాలికలుగను, పుష్ప గుచ్ఛములుగను మారిపోయెను; కొన్ని బోధివృక్షముక్రింద విడి విడి పూవులవలె చిందర వందరగా పడి అలంకారము చేకూర్చెను; కొన్ని బోధివృక్షముపై పడి పూలమాలలవలె వ్రేలాడుచు అందమిచ్చెను. మారుడు గౌతముని ప్రభావిభూతినిచూచి ఈర్ష్యా మాత్సర్యములు మనసులో ముప్పిరి గొనగా, మరలిపోయి తన కుమార్తెలను పిలిపించి గౌతముని జయించుటకు పంపెను.

మార పుత్రికలు గౌతముని కడకు వచ్చి, ముప్పది రెండు విధములయిన స్త్రీ మాయను పదర్శించిరి. గౌతముడు మందహాసముఖముతో కోపము, ఉద్రేకము, వంకర బుద్ధి, రాగము, దుష్టబుద్ధి లేక, పర్వత రాజువలె నిశ్చలుడై, వారి విలాసములకు లోబడిపోక, మనోజ్ఞ కలవింకస్వరముతో మారదుహితలతో ఇట్లనెను:

"ఓ కామినులారా, కామములు (కోరికలు) దుఃఖ

మునకు మూలములు. మూఢులు వీనికై యంగలార్తురు. ధ్యాన తపస్సులు వీనివల్ల పాడగుచున్నవి. ఐహికసుఖములవలన తృప్తి ఎన్నటికిని కలుగదు. ప్రజ్ఞయే తృప్తి కలిగించును. ఉప్పునీరు త్రాగినవానికి దప్పి ఆరనట్లు సుఖములు ఎంత అనుభవించినను దప్పితీరదు. కోరికలు ఆత్మార్థమును గావు, పరార్థమును గావు. కనుక నేను ఆత్మార్థము. పరార్థమును ఉత్సుకుడనై యున్నాను. మీ రూపము నురుగుబుడగల వంటిది. మీ కన్నులు కేవలము చర్మమయమయినవి, బుడగలవంటివి. మీరు కర్మక్లేశసంభవలైన దుఃఖయంత్రములు.''

మారదుహితలు తమ ప్రలోభనములను అతడు లోబడకున్న గ్రహించి అతనిని బహుప్రకారములుగ స్తుతించి వెడలిపోయిరి. మారుడు మరొకమారు గౌతముని జయించుటకు సేనతో వచ్చెను. కాని, అతనికి ''ఓ పాపీ! శూరుడు శత్రుసైన్యమును జయించినట్లు నిన్ను గౌతముడు జయించగలడు. మహామల్లుడు ప్రత్యర్థిమల్లుని పట్టుకొనునట్లు గౌతముడు నిన్ను పట్టుకొనును. మహామారుతము పిడికెడు ముంజగడ్డిని ఎగురగొట్టునట్లు నిన్నతడు ఎగురగొట్టును. సింహము నక్కలను పరువెత్తించినట్లు అతడు నిన్ను ఇప్పుడే పరువెత్తించును. మొదలునరికిన చెట్టువలె నీవు త్వరలో కూలిపోదువు. సూర్యుడు చిన్నమడుగును ఇంకింపజేసినట్లు నిన్నతడు ఇప్పుడే ఎండించివేయగలడు. మరణశిక్ష తప్పి వధ్యస్థానమునుండి పరుగులు తీయువానివలె నీవు ఇప్పుడే పారిపోగలవు. నిప్పు

మంటలకు తేనెటీగలు గుంపులుగట్టి తిరిగినట్లు నీవు ఇప్పు డతని ప్రతాపమునకు తిరుగుదువు. రాజ్యము కోల్పోయిన ధర్మరాజువలె నీవిప్పుడు అటమటింతువు. అడవిలో తెచ్చు కొన్న పాథేయము అయిపోయినవాడు తిట్టుకొనునట్లు తిట్టు కొందువు. ఓడ పగిలి సముద్రమధ్యమున ఏడ్చువానివలె ఏడ్తువు. కల్పాంత మహాగ్నిలో గడ్డి కాలిపోయినట్లు అతని తేజస్సునకు త్వరలో కాలిపోవుదువు. మహావజ్రము పర్వత సమూహమును నరికివేయునట్లు అతడు నిన్ను నరికివేయ గలడు.'' అని ఎవరో హెచ్చరించు చున్నట్లు తోచినది. అయినను అతడు తిరిగి వెళ్ళలేదు.

మారుడు తిరిగి వచ్చుట చూచి గౌతముడు భూమిని ఆస్ఫాలించెను. దానివలన కంచుపాత్ర మ్రోగినట్లు ఖంగు మనుధ్వని కలిగెను. అది ''మారుని చంపుడు, కొట్టుడు'' అని యనినట్లు మారునకి తోచెను. అతని యొడలు భయ ముతో చెమర్చెను; తేజస్సు కోల్పోయి ముఖము వెలవెల బోయి, రూపము చెడిపోయి, ముసలితనము వచ్చినట్లు భ్రాంతి కలిగెను. వెర్రెత్తినట్లాయెను. మూర్ఛయు వచ్చెను. సైన్యము చెల్లాచెదరయిపోయి, ఏడునాళ్ళపిదప కలసి కొనెను. ''బ్రతికితిమి. ఇంతయే చాలును'' అని సైనికులు తలపోసికొని సంతోషపడిరి.

మారుడు కొంతసేపటికి తెప్పరిల్లెను. ''లెమ్ము. త్వరగా వెళ్లుము. ఇక ఆలస్యము వద్దు. గురువులను ఎదిరిం

చినవారికి ఇట్లే యగును.'' అని అంతరాత్మ ప్రబోధించి నట్లాయెను. ''అయ్యో! నేను నా హితులమాట వినక శుద్ధ సత్త్వుడైన గౌతమునియెడ అపరాధము చేసితిని. దుఃఖము, భయము, వ్యసనము, శోకము, వినాశము, అవమానము, ధిక్కారము, దైన్యము పొందితిని.'' అని మారుడు చింతించి మరలిపోయెను.

గౌతముడు మారుని జయించెను. దేవాసురులు, గరుడ రాక్షస కిన్నర గంధర్వులు, బ్రహ్మ, శక్రుడు గౌతముని ప్రశంసించుచు జయ జయ నినాదములు చేసిరి. వారు సంతోషముతో హారములు, అర్ధచంద్ర ధ్వజములు, పతాకములు, ఛత్రములు ఎగురవేసిరి. పూవులు, అగరు, చందనచూర్ణము గౌతమునిపై కురిపించిరి. గగనమండలమున దుందుభులు మ్రోగెను.

గౌతముడు మారుని జయించి మరల ఘోరమైన తపము మొదలిడెను. అతని చిత్తము పరిశుద్ధము, పర్యవదాతము, ప్రభాస్వరము, అసంగము, క్లేశములు నశించినది, మృదువునయి, ఉత్తమజ్ఞానమును సాక్షాత్కరింపజేసికొనుటకు సిద్ధముగాను నుండెను. అప్పుడతడు ఇట్లు ఆలోచించెను: ''అయ్యో! ఎంతకష్టము! ఈలోకము ఆపదలకు లోంగి యున్నది. ఇది పుట్టి శిథిలమై నశించి చ్యుతమగుచున్నది. అంతియేకాని ఈ దుఃఖస్కంధమునుండి తప్పించుకొనుటను

తెలియలేకున్నది. జరా వ్యాధి మరణములతో కూడిన ఈ దుఃఖస్కంధమును పోగొట్టు క్రియను తెలియకున్నది."

అప్పు డతని మనస్సులో ఇట్లు తోచెను. "ఏది యున్నప్పుడు జరామరణములు కలుగుచున్నవి? ఈ జరా మరణములు కలుగుటకు కారణమేమి?" అని ఆలోచింపగా అతనికే సమాధానము తోచినది. "జాతి(జన్మ) యున్నప్పుడు జరామరణములు కలుగుచున్నవి. జరామరణములకు అదియే కారణము. జాతికి కారణము భవము. భవమునకు కారణము ఉపాదానము. ఉపాదానమునకు కారణము తృష్ణ. తృష్ణకు కారణము వేదన. వేదనకు కారణము స్పర్శ. స్పర్శకు కారణము షడాయతనము, షడాయతనమునకు కారణము నామరూపములుండుట. దానికి కారణము విజ్ఞానము. విజ్ఞానమునకు కారణము సంస్కారము. సంస్కారమునకు కారణము అవిద్య. అవిద్యయే అన్నిటికిని మూలము." అని తోచెను. అవిద్యను నిరోధించుటవలన ఈ దుఃఖ సముదయమును నిరోధింపవచ్చునని తోచినది.

ఈవిధముగ సపూర్వముగ నందీముఖరాత్రియందు చివరి జామున అరుణోదయసమయమున ఆ పురుషసింహుడు ప్రజ్ఞతో అనుత్తరమైన సమ్యక్సంబోధిని (లోకోత్తరమైన జ్ఞానమును) సాక్షాత్కరింప జేసుకొనెను. దేవతలు పుష్ప వర్షము కురిపించిరి. గౌతముడు విశుద్ధజ్ఞానముతో అభి సంబుద్ధుడై తథాగతుడయ్యెను. తథాయనగా సత్యమార్గము. సత్యమార్గమున నడచినవాడు తథాగతుడు.

## ౨౧

ఏడువారములు గడచెను. అప్పుడు తథాగతుడు తారాయణ పర్వతమూలమున విహరించుచుండెను. ఆసమయమున ఉత్తరాపథమున త్రపుషుడు, భల్లికుడు అను ఇద్దరు సోదరులు వర్తకులు ఉండెడివారు. వారు పండితులు, నిపుణులు, పెక్కువస్తువుల వ్యాపారమువలన ధనవంతులయిరి. వారు దక్షిణాపథమునకుపోయి వ్యాపారముచేసి, అధిక లాభములు పొంది, తిరిగి ఉత్తరాపథమునకు వచ్చుచుండిరి. వారివెంట వస్తువులతో నిండిన అయిదువందల శకటములుండెను. వారు కాపాడ్చొనియుండిన బండిని రెండు మేలియెద్దులు లాగుచుండెను. వానిపేరు సుజాతము, కీర్తి. ఏ యెద్దును లాగలేని శకటములను అవి లాగగలవు. వానిని తోలుటకు కొరడా అక్కరలేదు; ఉత్పలహస్తకమైనను (కాడతో నున్న కలువపూవు ఆకారముననున్న మెత్తని దారపు కుచ్చు), పుష్పదామమయినను చాలును. భయకారణమున్నప్పు డవి ఒక్కఅడుగైనను ముందుకు వేయవు; మేకులు కొట్టినట్లు నిలచిపోవును.

సార్థవాహులు తారాయణ పర్వత సమీపములోని క్షీరికావనములోనున్న దేవతామందిరము సమీపించువేళకు బండ్లన్నియు నిలచిపోయెను. బండిచక్రములు కుంచమువర

కును నేలలో దిగబడిపోయినవి. . ఎంత ప్రయత్నించినను వానిని కదల్చుటకైనను వీలు కాలేదు. "సామాన్యస్థలమున బండ్లెందుకు కూరుకొనిపోయినవి? ఇట్లెందుకు సంభవించినది?" అని వారు వితర్కింపదొడగిరి. సుజాతకీర్తులు లాగుచున్న బండియు నిలచిపోయెను. ఆయెడ్లును ఆగిపోవుటవలన ఏదైన భయంకర కారణము ఉండకతప్పదని వారు నిశ్చయించి, ముందుకుపోయి పరిశీలించుటకు గుర్రపురౌతులను పంపిరి. వారు తిరిగివచ్చి, తమకు భయకారణమేమియు కానరాలేదని తెలిపిరి.

సుజాత కీర్తు లనుబలీవర్దములు త్రపుష భల్లికులు కూర్చొనియున్న బండిని తథాగతుడున్న చోటికి లాగుకొనిపోయినవి. వారికి తథాగతుడు కనిపించెను. అతడు అగ్నివలె దీపించుచు, ముప్పదిరెండు మహాపురుష లక్షణములతోను విరాజిల్లుచుండెను; అప్పుడే ఉదయించిన సూర్యునివలె దేదీప్యమానముగ నుండెను. అతనిని చూచి వర్తకులు విస్మితులయిరి. "ఏమిది? ఇతడు భూలోకమున కవతరించిన బ్రహ్మదేవుడా? దేవతల ప్రభువైన శక్రుడా? వైశ్రవణుడా? సూర్యుడా? చంద్రుడా? పర్వతదైవమా? నదీదేవతయా?" అని వారికి సందేహము కలిగెను. అప్పుడు తథాగతుడు తాను ధరించిన కాషాయవస్త్రములు చూపెను. "కాషాయములు ధరించుటవలన ఇతడు సన్యాసియని స్పష్ట

మగుచున్నది. ఇతనివల్ల భయములేదు.'' అని వారు భావించిరి. ''పాపము! ఇతడు కాలభోజి అయియుండును. (బహుకాలమున కొకమారు భుజించు వ్రతముగలవాడు కాలభోజి.) ఇతనికి తినుటకు ఏమైన నున్నదా?'' యని వారు ప్రశ్నించుకొని, మధుతర్పణము (తేనె కలిసినపాలు), చెరకుముక్కలు ఉన్నట్లు తెలుసుకొని, వానిని తీసికొని తథాగతునివద్ద కేగి ప్రదక్షిణ నమస్కారములు చేసి, ఒక యోరగా నిలబడి ''ఓ మహాభాగా, మమ్ములను అనుగ్రహించి, ఈ భిక్ష స్వీకరింపవలెను.'' అని కోరిరి. తథాగతుడు వారిని కరుణించి, వారిచ్చిన మధుతర్పణమును భుజించెను. పిదప అతడు త్రపుష భల్లికులను ''మీకు సకల సంపదలు కలుగుగాక! మీకు సకలకుశలములు కలుగుగాక!'' అని దీవించెను.

ఆ సార్థవాహులును తథాగతుని ఆశీర్వాదములు పొంది, అతడు చెప్పిన దానిని ఏకాగ్రచిత్తముతో విని సపరివారముగా అతనిని, ధర్మమును శరణుపొందిరి.

## ౨౨

తారాయణాపర్వత సమీపములో నున్న గౌతమునికి ఒకప్పుడు ఇట్లు తోచినది. "నేను గంభీరమైన ధర్మమును కనుగొంటిని. ఇది శాంతము, ప్రశాంతము. ఉపశాంతము నయినది. నేను ఈ ధర్మమును ఇతరులకు ఉపదేశించునట్లయిన, వారు దీనిని గ్రహింపలేకపోయిన నాకు శ్రమ కలుగుట మాత్రమే కాక, నా ప్రయత్నము వ్యర్థము కాగలదు. నా ఉత్సాహము కొరవడగలదు. కనుక ఎవరైనను నన్ను కోరినచో ఈ ధర్మమును ఉపదేశింతును."

అతడు ఇట్లు ఆలోచించి ఊరకుండెను. కాని, వెంటనే అతనిలో మరియొక ఆలోచన కలిగెను. "ఈ లోకము నశించిపోవుచున్నది. నీవు అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలిసికొనియును లోకమునకు ధర్మోపదేశము చేయకున్నందున నే ఇట్లు సంభవించినది. నీవు ఉపదేశించు విషయములు అర్థము చేసికొనగలవారు ఉన్నారు. ఓ వాది భాస్కరుడా! జ్ఞానమండలమును విస్తరింపజేసి పదిదిక్కులయందును రశ్ములను ప్రసరింపజేయుము. జ్ఞానకిరణములతో లోకుల మనః పద్మములను మేల్కొల్పుము. నీవు ఉపేక్షింపకుము. ఓ లోక బంధూ! నీవు సంపాదించిన ఆర్యధనముతో ప్రజలకు ఊరట

కలిగింపుము. ఇప్పుడు తూష్ణీంభావము తగదు. నీవు ఉత్తమ
ధర్మమను దుందుభిని మ్రోగింపుము. సద్ధర్మశంఖమును వేగ
ముగా పూరింపుము. మహాధర్మయూపమును మీఁది కెత్తుము.
మహాధర్మ దీపమును వెలిగింపుము. ముఖ్యమైన ధర్మవర్ష
మును కురిపింపుము. భవసాగరములో నున్నవారిని తరింప
జేయుము. మహావ్యాధులచే క్లిష్టులైనవారికి విడుదల కలిగిం
పుము. క్లేశాగ్ని వలన కలుగు తాపమును శాంతింప జేయుము.
మోక్షద్వారము తెరువుము. అమూల్యమగు ధర్మనయ
మును తెలుపుము. జాత్యంధుడయినవానికి ఉత్తమమైన
ధర్మచక్షువు అనుగ్రహింపుము.'' అని బ్రహ్మ, ఇంద్రుడు
మొదలయినవారు అతనిని అర్థించిరి.

ఆ సమయమున మగధ దేశమున బహువిధ పాపకా
ర్యములు వ్యాపించినవి. వానివలన గాలులు వీచవని, అగ్ని
మండదని, వర్ష దేవత వర్షములు కురిపించదని, నదులు ప్రవ
హింపవని, సస్యములు వృద్ధిచెందవని, ఆకాశమున పక్షులు
ఎగురవని, తలకొక రీతిగా పలుకుచుండిరి. దుఃఖించుచున్న
ఆ జనులయెడ దయచూపుట ముఖ్యమని, దారిచూపు నాయ
కుడు లేక గోతిలోపడిన అంధులను పైకెత్తుట ధర్మమని, ధర్మ
ప్రబోధమున కిదియే తగిన సమయమని అతనికి నిశ్చయము
కలిగెను.

పిదప, తథాగతుడు లోకమును బుద్ధ చక్షువుతో

ప్రపంచమును పరిశీలించెను. దానిలో హీనులు, మధ్యములు, ప్రణీతులు ఉన్నారు. ఉచ్చ నీచ మధ్యములున్నారు. సాకారులు, సువిశోధకులు, దురాకారులు దుర్విశోధకులు ఉన్నారు. తామరకొలను ఒడ్డున నిలబడి చూచినప్పుడు, తామర పూవులలో కొన్ని నీటిలోపల మునిగియుండును; కొన్ని నీటికి సమానముగా నుండును. కొన్ని నీటికి పైగా నుండును. ఇట్లే బుద్ధ చక్షువునకు మూడు వర్గముల మనుష్యులు కనిపించిరి. "నేనిప్పుడు ధర్మము ఉపదేశించుటయా? మానివేయుటయా? మూడు విధములైన ప్రాణులలో మొదటివారు నేను ధర్మమును ఉపదేశించినను గ్రహింపలేరు. రెండవ వర్గమువారు ఉపదేశించిన గ్రహింపగలరు. మూడవ వర్గమువారు స్వయముగనే తెలుసుకొనగలరు." అని అతనికి తోచినప్పుడు రెండవ వర్గపు మానవరాశిపై-అనియతరాశిపై-ఎంతయో కరుణ కలిగెను. "వారికోసము అమృతద్వారములు తెరువబడినవి. వారు శ్రద్ధతో ప్రవేశింపగలరు. మగధదేశములోని మానవులు, సకల ప్రాణులు ఈ ధర్మమును వినగలరు" అని అతడు సంకల్పించుకొనెను.

తథాగతుడు కృత నిశ్చయుడై ఇట్లు తలపోసెను: "నేను ఈ ధర్మమును తొట్టతొలిగా ఉపదేశింపవలెను. ఎవ్వడు పరిశుద్ధుడు, సముచితాకారము గలవాడు, సన్మార్గ

మున ప్రవర్తింప జేయదగినవాడు, చక్కగా బోధింపదగిన వాడు, చక్కగా శోధింపదగినవాడు, దోషమోహములు తగ్గినవాడు, అపరోక్ష విజ్ఞానము గలవాడు, ధర్మము వినని వాడు అయియుండునో అట్టివానికి మొట్ట మొదట ఈ ధర్మ మును ఉపదేశింతును. నేను ఉపదేశించిన ధర్మమును తెలిసికొనువాడు నన్ను ద్వేషింపడు; హింసింపడు. ఇట్టి గుణములు కలవాడు రామపుత్రుడైన రుద్రకుడును; కలాప శాఖ వాడయిన ఆరాధు డనువాడును గలరు. వారికి మొదట ఉపదేశింతును.'' అనుకొనెను. కాని వారిరువురును వారముక్రిందటే మరణించినట్లు తెలిసెను. తథాగతుడు అప్పుడు తనను దుష్కరచర్యా ప్రారంభమున వదలిపోయిన భద్రవర్గీయులు ఐదుగురికి ఉపదేశింప ఎలచెను. వారు వారా ణాసిలో ఋషి పతన ప్రాంతమునందలి మృగదావ వనమున విహరించుట తథాగతుని దివ్యచక్షువునకు కనిపించెను.

౨౩

తథాగతుడు ఈ విధముగ ఆలోచించి, బోధి మండలమునుండి లేచి కాశికి బయలుదేరెను. అతడు మగధదేశమున తిరిగి, కాశీదేశ జనపదములలో తిరుగసాగెను. గయ సమీపమున ఒక ఆజీవకుడు (ఏకదండి సన్న్యాసి) అతనిని చూచి ఆశ్చర్యపడి, అతని సన్నిధికి వచ్చి ఇట్లు విన్నవించెను. "ఆయుష్మాన్! నీ యింద్రియము లన్నియు ప్రసన్నములు. నీవు పరిశుద్ధుడవయితివి. నీ దేహకాంతి పచ్చగ పెరిగి పోవుచున్నది. పాండుర పీతవర్ణ విరాజమానమైన శరత్కాలమువలె నున్నావు. నీ ముఖము పర్యవదాతముగ నున్నది. అప్పుడే తొడిమనుండి జారిపడిన తాటిపండు తొడిమ చుట్టు పట్ల పచ్చగ నున్నట్లు నీముఖముకూడ పచ్చగను, పర్యవదాతముగను ఉన్నది. సమర్థుడైన కర్మారపుత్రుడు (స్వర్ణకారుడు) మంటలనుండి అప్పుడే పైకితీసి పాండుకంబళముపై పెట్టిన బంగారు నిష్కము ఎట్టి రంగుతో మెరసిపోవునో, నీముఖమును అట్టిరంగుతో మెరసిపోవు చున్నది. బ్రహ్మచర్య మనునది ఏ విషయమున చెప్పుదురు? ఏ ఆచార్యుని యొద్ద బ్రహ్మచర్యము అనుష్ఠించితివి?'

తథాగతుడు ఆజీవకునితో ఇట్లనెను: "నాకు ఆచార్య

డెవ్వడును లేడు. నాతో సాటివాడును లేడు. నే నొకడనే ప్రశాంతేంద్రియుడను; సంబుద్ధుడను.''

ఆజీవకుడు :- ''గౌతముడా, నీవు అర్హంతుడవయి నట్లు గ్రహించితివా ?''

తథాగతుడు :-''నేనే అర్హంతుడను. లోకమున నేనే శాస్తను. నాకుమించి మరొకరు లేరు. ఈ దేవాసుర గంధర్వ లోకములలో నాతో సమానుడగు పుంగలుడు (ముక్త జీవుడు) మరొకడు లేడు.''

ఆజీవకుడు :-''అయిన, గౌతమా ? నీవు జినుడవా?''

తథాగతుడు :-ఔను. దుఃఖక్షయమైన నాబోటివారే జినులు. నేను పాపధర్మములను జయించినవాడను కనుక జినుడనైతిని.

ఆజీవకుడు :-''ఆయుష్మన్, ఇప్పుడు ఎక్కడికి వెళ్ల దలచితివి ?''

తథాగతుడు :—

''వారాణసీం గమిష్యామి గత్వా వై కాశినాం పురీమ్,
అంధ భూతస్య లోకస్య కర్తా స్మ్యసదృశాం ప్రభామ్.
వారణసీం గమిష్యామి గత్వా వై కాశినాం పురీమ్,
శబ్దహీనస్య లోకస్య తాడిష్యే౽మృత దుందుభిమ్.

వారాణసీం గమిష్యామి గత్వా వై కాశినాం పురీం,
ధర్మచక్రం ప్రవర్తిష్యే లోకే ష్వప్రతివర్తితమ్.

"వారాణసీ దేశమునకు వెళ్లి కాశీపురిచేరి చీకటియై పోయిన లోకమునకు సాటిలేని వెలుగు కలిగింతును. వారాణసికి వెళ్లుదును. శబ్దహీనమైన లోకమును అమృతదుందుభి ప్రమోగించి మేల్కొల్పుదును. వారాణసికి వెళ్లుదును. ఇది వరకు లోకములలో ఎవరును ప్రవర్తింపజేయని ధర్మచక్రమును ప్రవర్తింపజేయుదును."

"నీవు అట్లుచేయగలవు, ఆయుష్మన్!" అనుచు ఆ జీవకుడు దక్షిణదిక్కుగ వెళ్లెను; తథాగతుడు ఉత్తర దిక్కుగ వెళ్లెను.

తథాగతుడు గయచేరెను. గయలో నాగరాజగు సుదర్శనుడు అతనిని భిక్షతోను, వస్త్రములతోను గౌరవించెను. తథాగతుడు అక్కడినుండి రోహితవస్తు, ఉరు బిల్వాకల్పము, అనాలము, సారథిపురము అను నగరముల మీదుగ గంగాతీరము చేరెను. ఈ నగరములలో గృహపతులు అతనికి అన్నవస్త్రములు కల్పించిరి.

అప్పుడు గంగానది నిండుగ పారుచుండెను. తథాగతుడు ఈవలిగట్టునుండి ఆవలిగట్టునకు పోవుటకు ఒక నావికునివద్దకు వెళ్లెను. ఆ నావికుడు "ఆర్యా, పడవ పణ్యము

(కేవు) ఇమ్ము'' అని అడిగెను. ''మార్షులవద్ద తరపణ్యము (దాటుకేవు) లేదు.'' అని తథాగతుడు చెప్పుచు గగన మార్గమున నదిదాటి ఆవలియొడ్డు చేరెను. నావికుడు ఆశ్చర్యపడి ఆ విషయమును బింబిసార మహారాజునకు విన్నవించెను. ఆమాట విని, మహారాజు అప్పటినుండి సన్యాసులందరికిని తరపణ్యము తీసివేయవలసినదిగ ఉత్తరువుచేసెను.

## ౨౪

తథాగతుడు పిదప జనపదములలో సంచరించుచు వారాణసీమహానగరము చేరి పాత్రచీవరములతో భిక్షకై బయలుదేరెను. భిక్షయెత్తి భోజనము ముగించుకొని భద్రవర్గీయులు తపము చేయుచున్న ఋషిపతనమృగదావము వైపు నడచెను. ఆ భద్రవర్గీయులు అయిదుగురును తథాగతుని దూరమునుండియే చూచి క్రియాబంధము చేసిరి (అతని కొరకు ఏమియు చేయగూడదని చేతులు ముడుచుకొని అన్ని పనులును మానుకొనిరి.) "ఇదిగో! ఆయుష్మంతుడైన గౌతమశ్రమణుడు వచ్చుచున్నాడు. దుష్కరచర్య జరిపియు నితడు మనుష్యధర్మములను మించిన ఆర్యజ్ఞానవిశేషమును సాక్షాత్కరించుకొనలేకపోయెను. ఇప్పుడేమో కడుపునకు హాయిగొల్పు ఆహారము భుజించుచు, సుఖల్లికాయోగము ననుసరించి విహరించుచున్నాడు; కనుక వ్రతభ్రష్టుడయినాడు. ఇతనికి ఎవ్వరును ఎదురువెళ్లి స్వాగతము చెప్పవద్దు. పాత్రచీవరములు అందుకొనరాదు. అశనముగాని, పానీయముగాని ఇవ్వరాదు. పాదప్రతిష్ఠానము తగదు. వట్టి ఆసనములు ఉంచి 'ఆయుష్మన్, గౌతమ ఈ ఆసనములు రిక్తముగా (ఖాళీగా) ఉన్నవి. ఇష్టమున్న కూర్చుండుము' అనిమాత్రమే అనవలెను" అనివారు నిశ్చయించుకొనిరి.

జ్ఞానకౌండిన్యుడయిన తథాగతుడు ఈ విషయమును తన మనస్సుననే రానివ్వలేదు. ఒక్క మాటయును అనలేదు. అతడు భద్రవర్గీయులవద్దకు వచ్చినకొలది వారు తమ ఆసనములలో ఉండలేకపోయిరి. వారికి లేవవలెనను బుద్ధిపుట్టెను. పంజరముననున్న పక్షి పంజరముక్రింద నిప్పుపెట్టిన ఎట్లు తొందరగ నెగిరిపోవుటకు తపనపడునో తథాగతుడు సమీపించినకొలది భద్రవర్గీయులస్థితి అట్లే ఆయెను. సృష్టిలోని ప్రాణులలో తథాగతుని చూచి ఆసనమునుండి లేవనివా రెవరుందురు? అతడు సమీపమునకు వచ్చుకొలది, అతని సిరి, తేజస్సు చూచి వారు ఉండలేకపోయిరి. వణకుచు ఆసనములనుండి లేచి, తమ నిశ్చయమును మరచిపోయి, ఒకడు ఎదురువెళ్లెను; మరొకడు పాత్రచీవరములను అందుకొనెను; వేరొకడు ఆసనమును వంచెను; ఇంకొకడు పాదపీఠము పెట్టెను; ఐదవవాడు పాదప్రక్షాళనమునకు నీరు తెచ్చెను. "ఆయుష్మన్, గౌతమ, నీకు స్వాగతము. ఇదిగో ఆసనము. కూర్చుండుము" అని ఒకడు వంచిన ఆసనముపై బుద్ధుడు కూర్చుండెను. పిదప భద్రవర్గీయులును అతనితో వినోదకథలు చెప్పుచు కూర్చుండిరి.

తర్వాత వారు తథాగతుని "ఆయుష్మన్, గౌతమ నీ ఇంద్రియములు ప్రసన్నములయినవి. నీదేహకాంతి పరిశుద్ధమై పచ్చనివెలుగును విరజిమ్ముచున్నది. మనుష్య

ధర్మముకన్నను గొప్పదియగు ఆర్యజ్ఞానవిశేషమును సాక్షాత్కరించుకొంటివా ?'' అని ప్రశ్నించిరి.

వారికి గౌతము డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను : ''భిక్షువులారా! మీ రికమీద నన్ను ఆయుష్మంతు డను మాటతో వ్యవహరింపకుడు. ఇకమీద మీరు ధనము కొసము, హితముకొసము, సుఖముకొసము దీర్ఘరాత్రులు శ్రమపడవలసిన అక్కర లేదు. నేను అమృతమును సాక్షాత్కరించుకొంటిని. నామార్గము అమృతగామి. నేను బుద్ధుడను; సర్వజ్ఞుడను; సర్వదర్శిని; దుఃఖరహితుడను. అన్ని ధర్మములు నావశమయినవి. నేను ధర్మము ఉపదేశింతును. మీరు త్వరగ రండు; చెవియొగ్గి వినుడు; నేను ధర్మము చెప్పుచున్నాను; అనుశాసించుచున్నాను. నేను బాగుగ తర్కించి, అనుసరించి తెలిసికొంటిని. మీరును తెలిసికొనుడు. ఇప్పుడు మీరు నన్నుగురించి యేమి భావించితిరో నేను గ్రహింపగలిగితిని.''

ఆమాటలకు పంచవర్గీయుల మనస్సులోని సందేహములు పటాపంచలై పోయెను. వారు అతని పాదములపై బడిరి; మన్ననవేడిరి. తర్వాత వారు అతని స్నానమునకు ఏర్పాటుచేసిరి. గౌతముడు స్నానముచేసి, ఒక ఆసనమున నిర్భయముగ పర్యంకబంధమున ఆసీనుడాయెను. ఐదుగురు భద్రవర్గీయులును అతని ఎదుట ఆసీనులయిరి.

ఆ సమయమున తథాగతుని దేహమునుండి దివ్య ప్రభలు బయలువెడలి లోకములన్నిటిని అవభాసింపజేసినవి. చీకట్లు తొలిగిపోయినవి. ఏ ప్రాణి కైనను ద్వేషముగాని, భయముకాని, త్రాసముగాని, స్తబ్ధత్వముగాని కలుగలేదు. అన్ని ప్రాణులకు సుఖము కలిగినది. అప్పుడు గౌతముడు ఇట్లు ఉపదేశించెను.

"భిక్షువులారా, వినుడు. ప్రవ్రజితుడు అనుసరింపవలసిన మార్గములు రెండున్నవి. మొదటిది కోరికలను అనుసరించి సుఖములు అనుభవించుట. ఇది సుఖల్లికా యోగము. ఇది నిందితము; అనార్యము. రెండవది స్వదేహ క్లేశాను యోగము. ఇది దుఃఖకరమైనది; అనర్థములు కలిగించునది. ఒకటి ఒకకొన, మరొకటి ఇంకొక కొన. ఈ అంత మార్గములు రెండును వదలి మధ్యమ మార్గమున నేను మీకు ధర్మ ముపదేశించు చున్నాను.

"సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పము, సమ్యక్ వాక్యము, సమ్యక్కర్మ, సమ్యగాజీవము, సమ్యక్ వ్యాయామము, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి-అనునది అష్టాంగ మార్గము. ఆర్య సత్యములు నాలుగు: దుఃఖము, దుఃఖ సముదయము, దుఃఖనిరోధము, దుఃఖనిరోధగామిని అయిన ప్రతిపత్తు (జ్ఞానము). దుఃఖమనునది ఏమిటి? జన్మ దుఃఖము, జర దుఃఖము, వ్యాధి దుఃఖము, మరణము దుఃఖము, అప్రియ

సంప్రయోగము, ప్రియ విప్రయోగము దుఃఖములు. దేని నైనను కోరి పొందకపోయిన దుఃఖము. దుఃఖ సముదయము పునర్జన్మకు కారణమైనది; సుఖరాగ రహితమైనది; అక్కడక్కడ సంతోషము కలిగించు తృష్ణయే దుఃఖ సముదయము. ఈ తృష్ణను నిరోధించి విరాగము పొందుటయే దుఃఖ నిరోధము. దుఃఖ నిరోధగామిని అయిన ప్రతిపత్తి అనునది ఏమి ? ఇదియే అష్టాంగ మార్గము. సమ్యక్ దృష్టి మొదలు సమ్యక్సమాధివరకు నేను ఇంతకుముందు చెప్పినట్టిది. ఇదియే దుఃఖ నిరోధగామి అయిన మార్గమని నాకు వెలుగు కలిగినది. దుఃఖ మనునది తెలిసికొంటినని, దుఃఖ సముదయమును వదలుకొంటినని, దుఃఖ నిరోధమును సాక్షాత్కరించు కొంటినని, దుఃఖ నిరోధగామి అయిన జ్ఞానమును భావించితినని నాకు వెలుగు కలిగినది. నాకు జ్ఞానదర్శన మయినది. నా జన్మ క్షయించినదని, ఇక జన్మ కలుగదని తెలిసికొంటిని.''

ఆ క్షణమున అంతరిక్షమునుండి ''ఈ శాక్యఋషి ఉత్తమమైన ధర్మచక్రమును వారాణసిలోని ఋషిపతనమున ప్రవర్తిప జేసెను'' అనుధ్వని బయలువెడలి విశ్వమంతటను వ్యాపించినది.

శాక్యముని ఈవిధముగ ధర్మమును ఉపదేశింపగా, దేవతలు, మైత్రేయుడు మొదలయిన పూర్వబుద్ధులు హర్ష

ధ్యానములు చేసిరి. ఇట్టి ధర్మచక్రమును ప్రవర్తింపజేయుట వలన గౌతమునికి సమ్యక్సంబుద్ధుడని, స్వయంభువని, ధర్మస్వామి అని, నాయకుడని, వినాయకుడని, పరినాయకుడని, ధర్మచక్ర ప్రవర్తకుడని ఖ్యాతి కలిగెను; మరియును పెక్కు-పేర్లు కలిగెను.

ఈ ధర్మమును ప్రకాశింపజేయుటకు మహేశ్వర నంద సునంద చందన మహిత శాంత వినీత ఈశ్వర ప్రముఖులైన అష్టాదశ దేవపుత్రులు, వేలకొలదిగానున్న శుద్ధావాస కాయికులైన దేవపుత్రులు ధర్మచక్రప్రవర్తన సమయమున భగవానుని సన్నిధిని ఉండిరి. వారందరును "మేము శివంకరమగు బోధిని పొందితిమి. త్వరలో లోకమునకు లోకోత్తరమగు ధర్మచక్షువును ఇచ్చువారమగుదుము" అని విన్నవించి ప్రపంచము నలుదెసలకును బయలువెడలిరి.

బుద్ధభగవానుని మొదటియుపదేశము ఇదియే. దీనినే ధర్మచక్రప్రవర్తన మందురు. ఈ ధర్మచక్రమిట్లు మొట్టమొదట ప్రవర్తితమైన యీ ప్రదేశమును నేడు సారనాథ్ అనుచున్నారు. ఇది బౌద్ధులకు గొప్ప పుణ్యక్షేత్రము.

## ౨౫

సర్వార్థసిద్ధ రాజకుమారుడు సమ్యక్సంబోధిని పొంది మృగదావమున ధర్మచక్రమును ప్రవర్తింపజేసినపిదప వారాణసిలో స్వేచ్ఛగా ధర్మవిహారమొనర్చెను. అచ్చట అతనికి అరువదిమంది శిష్యులేర్పడిరి. వారితో నతడు తొలి బౌద్ధసంఘము నిర్మించెను. వారిని అతడు ధర్మోపదేశము నకై వివిధదేశములకు పనిచి మగధకు బయలుదేరెను.

బుద్ధభగవానుడు తనవాగ్దానము మేరకు మగధరాజగు బింబిసారునకు ధర్మోపదేశము చేయదలచి, అతని రాజధానియగు రాజగృహము చేరెను. అప్పుడు బింబిసారుడు గొప్పయాగము చేయుచుండెను. ఋత్విక్కులు మంత్రములు జపించుచుండిరి. బింబిసారుడు అగ్నిలో ఆహుతులు సమర్పించుచుండెను. యజ్ఞపశువుల అరపులు కర్ణకఠోరముగ వినబడుచుండెను. అదియంతయును బుద్ధునికి మిగుల దుఃఖముకలిగించెను.

‘‘రాజా, ఈ యాగ మెందులకు?’’ అని అతడు ప్రశ్నించెను.

"స్వర్గాదిసుఖములుపొందుటకు" అని రాజు సమాధానమిచ్చెను.

"నోరు వాయిలేని జంతువులను బలియిచ్చుటవలననే స్వర్గాదిసుఖములు కలుగునప్పుడు, నోరు వాయిగల నన్ను బలియిచ్చుటవలన నింకను ఎక్కువఫలములు గలుగును గదా! నన్ను చంపి ఈ పశువులను వదలిపెట్టుము." అని రాజును బుద్ధభగవానుడు ప్రతిమాలెను.

బింబిసారునకు పూర్వస్మృతి కలిగెను. అతడు గౌతముని గుర్తుపట్టి "ఇతడు మహాజ్ఞానముపొంది మరలి వచ్చిన సిద్ధార్థుడే" యని తెలిసికొని, పశువిశసనయజ్ఞమును చాలించి, పశువులను విడచిపుచ్చి, బుద్ధుని శరణుపొంది ధర్మోపదేశము పొందెను. తర్వాత అతడు బుద్ధుడు, బుద్ధసంఘము నివసించుటకై రాజగృహ సమీపమునందున్న యొక రమ్యమైన ప్రాంతమున ఒక విహారమును (భిక్షునివాసగృహము) నిర్మించెను.

బుద్ధుడు రాజగృహములో నున్న సమయమున సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు అను వారిరువురు అతనిని శరణుపొంది, ప్రవ్రజ్య స్వీకరించి అనుచరులయిరి. పిదప బుద్ధభగవానునికి పలువురు రాజులు, రారాజులు, సార్వభౌములు, సామంతులు, శ్రీమంతులు శిష్యులై బౌద్ధధర్మ

దీక్ష గైకొని, "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" యని త్రిశరణము లను ఆశ్రయించిరి.

ఇట్లుండగా శుద్ధోదన మహారాజు తన కుమారుడు చాల సంవత్సరములు తపమాచరించి బుద్ధపదవిని పొంది ధర్మోపదేశములు చేయుచున్నాడని విని, అతనిని పిలుచు కొనివచ్చుటకు పరిజనముతోగూడ నొక యమాత్యుని పంపెను. అతడు బుద్ధభగవానుని యొద్దకు పోయి, తనవచ్చిన పని మరచి దీక్షగైకొని భగవానుని సన్నిధియందే యుండి పోయెను. పలువురు మంత్రులట్లే వచ్చి భగవానుని యుప దేశామృతము విని మరలిపోలేకపోవుచుండిరి. తుదకు భగ వానుడు ఉదాయియను వృద్ధామాత్యుని సంప్రార్థనమున కపిలవస్తు నగరమునకు వచ్చి, శుద్ధోదనునకును, నందుడు మొదలయిన సోదరవర్గీయులకును ధర్మదీక్ష నొసంగెను.

బుద్ధభగవానుడు కపిలవస్తు నగరమున రాజప్రాసాద మున విడిసినప్పుడు గోపాదేవితక్క రాణివాస మంతయును వచ్చి, యతనిని దర్శించి నమస్కరించెను. బుద్ధభగవానుడు సారిపుత్ర మౌద్గల్యాయనులతోబాటు గోపాదేవి శయనా గారమునకు బోయెను. యశోధర చిక్కిన మేనుతో వచ్చి భగ వానుని కాళ్లపైబడి నమస్కరించెను; పుత్రుడగు రాహులుని అతని పాదసన్నిధిని ఇడెను. గౌతముడు మహాభినిష్క్రమ

ణము చేసిననాడే రాహులు డుదయించెను. భగవానుడు ఆమెకు ధర్మోపదేశ మొనర్చి వెడలిపోయెను.

ఇట్లు బుద్ధభగవానుడు పాదచారియై సంచరించుచు, శ్రావస్తి, వైశాలి, రాజగృహాము, చంపానగరము, కుశీనరము మున్నగాగల నగరములకు వెళ్లి విశ్రమించుచు ప్రజలకు వారిభాషయగు పాలీభాషలోనే ధర్మోపదేశము చేయుచు నలుబదియయిదేండ్లు గడపెను. అప్పటి కతనికి ఎనుబది సంవత్సరములు నిండెను.

## — ౧౬ —

బుద్ధునికాలమున వైశాలినగరము జంబూద్వీపము నందలి పట్టణములలో మిక్కిలి అందమైనది. అది బౌద్ధమత ప్రచారకులకు కేంద్రమై వెలసెను. ఆనగరము పరిసరము బౌద్ధవిహారము లనేకము లుండినవి. అవి బౌద్ధభిక్షువులు నివసించుటకయి నిర్మింపబడినవి. సర్వార్థసిద్ధుడు కొన్నిదినములా మహానగరమున నివసించి, సంఘారామములకు పోవుచు, అప్పుడప్పుడు కొన్ని విహారములందు నివసించుచుండెను. ముఖ్యశిష్యుడగు ఆనందు డాతని వెంటనే యుండెను.

బుద్ధునకు, ఆయా సంఘారామములలోని భిక్షువులకు ధర్మోపదేశ మొనర్పవలెనను సంకల్పము కలిగి, యొకనా డానందునకు తన సంకల్పమును తెలిపెను. వెంటనే ఆనందుడు వారి నందరిని సమావేశపరచెను. అప్పుడు సర్వార్థసిద్ధుడు వారందరికి నిట్లు మహాధర్మము నుపదేశించెను:

"సోదర భిక్షువులారా! నేను బహుశ్రమల కోర్చి కనిపెట్టిన సత్యధర్మమును మీ కుపదేశించితిని. దానిని మీరు బాగుగా గ్రహించి స్వయముగా నాచరించుచు, ఇతరులును ఆచరించునట్లు చూడుడు. ఇయ్యది మనుష్యులకే కాక దేవతలకును క్షేమమును, సౌఖ్యమును కలిగించి లోకము నుద్ధ

రించగలదు. ఆ సత్యధర్మమునే మరల మీకు వివరించి చెప్పుచున్నాను. వినుడు.

"మననము నాల్గు విధములైనది. పాపముతోడి యుద్ధము చతుర్విధమైనది. ఋషియగుటకు నాల్గు విధములైన మార్గములు కలవు. నీతిబలము పంచవిధము. అట్లే యాత్మజ్ఞానమును ఐదు విధములైనది. జ్ఞాన మేడువిధములు. సన్మార్గ మెనిమిది విధములు. మీరు వీని నలవరచుకొన్న యెడల సుఖదుఃఖాదులగు ద్వంద్వములు నశించును. నిర్వాణము కలుగును. అందువలన మీరు శ్రద్ధతో ముక్తిని పొందుటకై స్వయముగ యత్నింపుడు. తథాగతునకు శీఘ్రకాలములోనే నిర్వాణము కలుగును. ఇంక మూడు మాసములే వ్యవధియున్నది. ఆపైని ధర్మప్రచారము చేయు బాధ్యత మీదేయని తెలిసికొనుడు."

ఇట్లు భోధించి గురాతడు భిక్షువులందరిని పంపివేసి వైశాలి నగరమును విడిచి బయలుదేరెను. అతని వెంట ఆనందుడును, మరికొందరు ముఖ్యశిష్యులు నుండిరి. వారితో కూడ బుద్ధుడు పావాయను గ్రామమునకు పోయెను. ఆ గ్రామమున చందుడను కమ్మరి మిక్కిలి భక్తితో అంజలి ఘటించి సర్వార్థసిద్ధుని సమీపించి తనయాతిథ్యమును స్వీకరింపవలయునని ప్రార్థించెను. బుదుడు దానికి సమ్మతించెను. చందుడా మహనీయునకయి పెక్కు మధుర

పదార్థములను వండించెను. కాని, బుద్ధుడు వానిని తన శిష్యుల కిమ్మని చెప్పి తానుమాత్రము సామాన్యమైన ఆహార మునే స్వీకరించెను.

సర్వార్థ సిద్ధుడు పావాగ్రామమును విడిచి కాశీనగ రమునకు ప్రయాణమయ్యెను. మార్గములో రక్తగ్రహణి యంకురించి యతడు మిక్కిలి బాధపడెను. సహింపరాని యా బాధకు బుద్ధు డెంతమాత్రము మనోవైకల్యము చెంద లేదు.

బుద్ధదేవునిస్థితి విషమించెను. దినక్రమమున రోగము హెచ్చసాగెను. శరీర బలము క్షీణించెను. బలహీను డయ్యు నాతడు తన ప్రయాణమును మానలేదు. అతడు ప్రయాణము చేయుచు మార్గమునకు సమీపమున నున్న యొక చెట్టునీడకు పోయి ఆనందుని పిలిచి, "ఆనందా మిక్కిలి యలసటగా నున్నది. కొంచెముసే పిచట విశ్ర మింతును. నా కాషాయవస్త్రములను పరువుము" అని చెప్పెను. ఆనందుడు కావిగుడ్డలతో పడక నేర్పరచెను. పిదప నాతనిచే మంచినీటిని తెప్పించుకొని దప్పి తీర్చుకొని కొంచెముసేపు విశ్రమించెను. కొంత సేద తీరినపిదప పమీప మునగల బర్హ్వానదికి పోయి స్నానమాచరించెను. అది కాశీ నగరమున కామడ దూరమున నున్నది.

పిదప ప్రయాణమును సాగించి బుద్ధుడు కుషిమార

పురమునకుపోయి, తత్సమీపముననున్న యొక యుపవన మున విడిసెను. అచ్చట బుద్ధుడు ఆనందుడు నిర్మించిన శయ్యపై కాలిపై కాలు వేసికొని, కుడిప్రక్క కొత్తిగిలి పరుండెను. వృక్షములనుండి సురభికుసుమములు జల జల నాతనిపై రాలినవి. ఆ సంఘటనము తథాగతున కానందము కల్గించెను. అత డానందుని చూచి "ఆనందా! చూడుము. ఇది వసంతకాలము కాదు. కాకున్నను వృక్షములు పుష్పించి, తమ పూవులను నాపై రాల్చి గౌరవించుచున్నవి! ఇంతకంటెను కావలసిన గౌరవము మరియొకటి కలదు. అది యేదనగా—భిక్షువుగాని, భిక్షుణిగాని, అనుచరుడుగాని, గృహస్థుడుకాని, సన్న్యాసికాని,—వారు వీరను భేదము లేక అందరును ధర్మముగా ప్రవర్తింపవలెను. స్వల్పాధిక భేద ములు లేక అన్ని విషయములందును సత్యవాక్పాలనము, ధర్మప్రవర్తనము ననుసరించుచు జీవితమును గడపుటే నన్ను గౌరవించుటయని నా యాశయము." అని పలికెను.

నాటిరాత్రి యాతనికి రోగ మధికమయ్యెను. అవసాన సమయము ప్రాప్తించెను. ఇక తమ గురువర్యుడు జీవించుట కష్టమని శిష్యులకు తోచినది. వారిధైర్యము నశించెను. దుఃఖముపట్టలేక వారు కొంతదూరముగా పోయి విలపింప సాగిరి. ఆనందుడు, అనిరుద్ధుడు మున్నగు కొద్దిమంది మాత్రమే ఆయన సిద్ధిపొందిన సమయమున గురుసన్నిధి

నుండిరి. కశ్యపుడు వచ్చుసరికే బుద్ధుడు నిర్యాణము పొందెను.

గౌతమబుద్ధుడు మరణింపనున్న సమయమున ఆనందు డిట్లు పలికెను—"స్వామీ! నీవు కల్పాంతమువరకును జీవించి మమ్మనుగ్రహింపుము. మానవుల క్షేమసౌఖ్యముల కొరకై ప్రపంచముపై దయదలచి, జీవింపుము. దివ్య మానవుల క్షేమ లాభములను కోరి కల్పాంతమువరకును తప్పక జీవింపుము. ప్రభూ! జీవింపుము."

అజ్ఞుడగు పసివానివలె పలుకుచున్న ఆనందుని యీ పల్కులు విని బుద్ధుడు చిరునవ్వునవ్వెను.

పిదప ఆనందుడు మరల నిట్లనెను-"ప్రభూ! ఈ యడవినడుమ మీరు మరణింపకూడదు. రాజగృహము, వారణాసి, చంపాపురము మున్నగు నగరములలో నెచట నైనను నిర్యాణము పొందవలెను. అచట మీ భౌతిక దేహమునకు తగిన గౌరవముజరుగును. మీరుపదేశించిన ధర్మములయెడ విశ్వాసముకలధనికు లెందరో ఆ మహానగర ములలో కలరు."

ఆనందుని యీ మాటలు విని బుద్ధుడు చిరునవ్వునవ్వి "ఆనందా! నేనెచ్చట మరణించిన నేమి? నా శరీరమును గౌరవముతో చూచు భాగ్యవంతు లనేకులున్నారు. దానికై నీ వెంతమాత్రము విచారింపకుము. నీసంగతి చూచుకొనుము.

జాగరూకతతో ఉండి, నీ మేలు నీవు గమనింపుము, మరియొక సంగతి! చందుడు పెట్టిన యాహారమును తినియుంటిని, కావున, అతనికి ముందుజన్మమున గొప్ప యదృష్టము కలుగునని నా మరణానంతర మాతనికి తెలియజేయుము. ఈ మాటలు నావలన నీవు స్వయముగా విని నట్లాతనితో చెప్పుము. తప్పక చెప్పుము. అతని కదృష్టము కల్గుటకు సందేహము లేదు. ఏలయన-దానము లన్నింటిలో అన్నదానమే గొప్పది. దానివిమించిన దానము వేఱొకటి లేదు. నా కా యన్నదానము రెండుసారులు ఉత్కృష్టమైనది లభించెను. అందు మొదటిది—నాకు బుద్ధత్వము ప్రాప్తించుటకు పూర్వము సుజాత యొనరించిన యన్నదానము! రెండవది-నేనీలోకమును విడిచి వెళ్ళిపోవుటకు ముందు చందు డొసంగిన యన్నదానము! ఈ రెండును మిక్కిలి యుత్కృష్టములు!

''ఆనందా! ఎవ్వరైనను చందునివద్దకు పోయి 'ఓయి చందుడా! నీవు పెట్టిన యాహారమును భుజించిన వెంటనే తథాగతుడు దేహమును విడిచెను. ఇది నీకు కీడు; గొప్ప నష్టము. అపకీర్తికరము' అని పలికి చందునకు భయమును, విచారమును కలిగింపవచ్చును. కావున నీ వాతనివద్దకు పోయి 'చందా! నీ వెంతమాత్రము వెరవవద్దు. విచారింపవద్దు. బుద్ధుడు నీ చేతి యాహారమును స్వీకరించుట నీకు శ్రేయోదాయకమే కాని అపాయకరము కాదు. నీ వొసంగిన

యాహారము తినియే తథాగతుడు పరమసిద్ధిని పొందెను' అని నొక్కి చెప్పుము. ఇట్లు చెప్పి వానికి ధైర్యము కలిగింపుము'' అని పలికెను.

తథాగతుని యీ మాటలు వినుచున్న యానందునకు దుఃఖము పొంగిపొరలెను. అతడు గురుసన్నిధి నుండలేక దూరముగా పోయి విలపించుచుండెను. కొంచెము సేపటికి బుద్ధుడటునిటు చూచి, యానందుడచ్చోట లేకుండుట గమనించి ''ఆనందుడు కానరాడే! అతడెక్కడ?'' అని తన సన్నిధినున్న శిష్యులను ప్రశ్నించెను. అప్పుడు వారు ''దేవా! పరమపూజ్యుడగు నానందుడు మనోధైర్యమును పట్టలేక దూరముగా పోయి దుఃఖించుచున్నాడు. దేవరసన్నిధినే యుండి దుఃఖించి గురూత్తములకు కలత పాటుకలిగించుట పాడిగాదని యాతని తలంపు.'' అని పలికిరి. అంత బుద్ధభగవాను డానందుని తనకడకు తీసికొని రావలెనని చెప్పెను. కొలది సేపటిలో కన్నులు తుడుచుకొనుచు ఆనందుడు గురుసన్నిధిని నిలిచెను.

తథాగతుడు మెల్లగా అతనితో నిట్లనెను:-''నాయనా! ఆనందా! దుఃఖించి బాధపడకుము. నీవు శ్రమపడుట నాకు సమ్మతము కాదు. చూడుము. మన కత్యంత ప్రియములైనట్టియు, సమీపమున నుండునట్టియు వస్తువులమెడల నిట్టిభావ ముదయించుట స్వాభావికమే! ఇట్టివానియందు

మనస్సును లగ్నము చేయవలదని నే ననేకపర్యాయములు బోధించి యుంటిని కదా! ఎట్టి గొప్పవస్తువైనను శాశ్వతముగా నుండుట సాధ్యము కానేకాదు. ఆనందా! నీకు నాయెడల నపారమైన దయ. చిరకాలమునుండియు నవ్యాజప్రేమతో నా కింతింతయనరాని యుపచార మొనరించి పరమాప్తుడవైతివి. నాయాశయములను ప్రచార మొనర్చి యుత్తమ ధర్మమును నెరవేర్చితివి. అంతఃకరణశుద్ధిగ నీ ప్రయత్నములను నీ వొనరించుచుండుము. ఇట్లు యత్నించిన యెడల నీవు కూడ మహాపాపములనుండియు, భోగపరాయణత్వము నుండియు, మాయనుండియు, అహంభావమునుండియు, అజ్ఞానము నుండియు నచిరకాలములోనే విముక్తుడవు కాగలవు.''

రాత్రి కడచిన కొలదియు బుద్ధభగవానుని స్థితి క్షీణింపజొచ్చెను. అట్టిసమయమున నచ్చటికి కుశీనరనివాసియగు నొక విప్రుడరుదెంచెను. అతనిపేరు సుభద్రుడు. గొప్ప ప్రతిభాశాలి. వేదవేదాంగవేత్త. వేదాంతశాస్త్రమున నత్యంతసమర్థుడు. అతడు మెల్లగా నానందుని సమీపించి యిట్లు పలికెను.

''అయ్యా! నే నిపు డొక గొప్పపనికయి యిచటికి వచ్చితిని. బుద్ధభగవాను డీరాత్రియే దేహమును చాలించి, మహానిర్వాణమును పొందునని వింటిని. ఆయన జీవించి

యుండగనే నా యీప్సిత మీడేరవలెను. మరేమియును కాదు. చాలదినములనుండియు నన్నొకసందేహము పీడించు చున్నది. దానిని తీర్చువా డాతడు తక్క వేరొకడు లేడని నాకు తోచినది. ఎంతో శ్రమపడి యిప్పటి కిచ్చటికి రాగలిగి తిని. నీవునాయెడ దయయుంచి ఆ మహాశ్రమణుని చూచు టకు నాకనుమతి నిమ్ము''

సుభద్రునిమాటలు విని యానందుడు ''అయ్యా! సుభద్రుడా! బుద్ధభగవానుని నిపుడు బాధింపకుము. ఆయన మిక్కిలి యాయాసపడియున్నాడు. మాటలాడుటకును తగిన శక్తి లేదు.'' అని జబాబిచ్చెను. కాని సుభద్రుడు మరల మరల ఆనందుని ప్రార్థింపదొడగెను. ఆనందుడును బుద్ధ భగవానుని స్థితిని వివరించుచు, ఆయనను చూచుట కను మతిని నిరాకరించుచుండెను. వీరి సంభాషణమును కొం చెము దూరముననున్న తథాగతుని చెవిని పడెను. ఆయన వెంటనే ఆనందుని పిలిపించి యిట్లనెను: ''ఆనందా! సుభ ద్రుడు తనకు గలిగిన సందేహములను తీర్చుకొనుటకు నా వద్దకు వచ్చుచున్నాడు కాని, నన్ను బాధించుటకు రాలేదు. మన శరీరస్థితి యెట్లున్నను, దానిని లెక్కింపక సందేహ నివారణకయి మనవద్దకు వచ్చినవారికి సాయపడుట మన ధర్మము. కావున నీవు సుభద్రు నెంతమాత్రము ఆటంక పరుపకుము. నావద్దకు పంపుము.''

బుద్ధభగవానుని యీ మాటలు విని ఆనందుడు వెంటనే సుభద్రుని గురువువద్దకు తీసికొనివచ్చెను. సుభద్రుడు భగవానున కభివాదన మొనరించి, ఆతని యాదేశమున నాతని శయ్యాప్రక్క కూర్చుండెను. ఇట్లు కూర్చుండి యాతడు బుద్ధభగవానుని జూచి "మహాపురుషా! వివిధ శాఖలకు ప్రధానపురుషులుగా బ్రాహ్మణోత్తములగు పురాణకశ్యపుడు, మఖాళి, అజితుడు, కాత్యాయనుడు, సంగయుడు, వేలాతికుడు, నిగ్రంథుడు మున్నగు తపస్వులు న్నారు కదా! వారు లోకమునకు కొన్ని విషయములను వెల్లడించియున్నారు. వారందరును పదార్థతత్త్వమును గ్రహించినవారేనా? లేక కొందరు మాత్రమే గ్రహింపగలిగిరా? ఈ విషయము నాకు తెలియకున్నది. నా సందియమును తీర్పవలెనని ప్రార్థించుచున్నాను" అని యడిగెను.

సుభద్రు డిట్లు ప్రశ్నింపగా బుద్ధభగవానుడు పరమ శాంతముగా మెల్లగా నిట్లు పలికెను: "సుభద్రుడా! ఆ బ్రాహ్మణులు తత్త్వమును గ్రహించిరా? లేదా? అను సందేహ మటుండనిమ్ము. అది ప్రస్తుతమున కంత ముఖ్యము కాదు. దానిని చర్చించుట కిది సమయముకూడ కాదు. ఒరుల విజ్ఞాన చర్చ మన కెక్కువ యుపయోగింపదు. ఇతరుల సంగతిని విడిచి, నీగురించి నీ వాలోచింపవలసి యున్నది.

నేను నీకొక పరమార్థమును బోధించెదను. సావధానచిత్తముతో వినుము.''

ఇట్లు పలికి సర్వవిషయసారము నెరింగిన బుద్ధ భగవానుడు కొన్ని విషయములను బోధించెను. నీతిమార్గమే అన్నింట ముఖ్యమనియు, ఆ నీతిపథమును విడనాడిన మత సిద్ధాంతముల ననుసరించినవారికి మోక్షము లేదనియు, పవిత్ర జీవనముతో ప్రారంభమై, భూతదయతో నంతమైన అష్టవిధ పావనమార్గముల ననుసరించినవారికే మోక్షము లభించుననియు వివరముగా తెల్పెను. ఈ బుద్ధభగవానుని బోధను విని సుభద్రుడు పరమానంద భరితుడయ్యెను. ''భగవన్ ! మీ ముఖమునుండి వెలువడిన యీ యమృత వాక్యములు మిక్కిలి ప్రశస్తములైనవి. దేవర నన్ను శిష్యునిగా పరిగ్రహింపవలెను. నా శరీరములో ప్రాణము లుండునంతవరకు - నేడు మొదలు పరమ విశ్వాసముతో నుండును. బౌద్ధమత సిద్ధాంతములు నాకు బాగుగా నచ్చినవి'' అని సవినయము ప్రార్థించెను.

బుద్ధభగవాను డాతని ప్రార్థనను విని ''సుభద్రా! చాలసంతోషము. ఒకసంగతిని వినుము. ఇంతకుపూర్వ మొక సిద్ధాంతమునందుండి, యిప్పుడీ నవీనసిద్ధాంతము ననుసరింప దలచినవారు ముందుగా నాలుగుమాసములు శుశ్రూష చేయవలసియున్నది'' అని తెలిపెను. ఈ నియమమునకు

సుభద్రుడు సమ్మతించెను. అంత సర్వార్థసిద్ధుడు ప్రియ శిష్యుడగు ఆనందుని పిలిచి "ఆనందా! సుభద్రుడు మన మతమున జేరుటకు సంసిద్ధుడై యున్నాడు. మన నియముల నన్నింటిని పాలించును. ఇతనికి దీక్షనొసగుము" అని యాదేశించెను.

అంత నానందుడు సుభద్రుని వెంట నిడుకొనిపోయి స్నానముచేయించెను. లోకములోని సమస్తవస్తువులు నశ్వరములని యొకానొక మంత్రము నుపదేశించి, పునశ్చరణచేయించెను. శిరస్సును, గడ్డమును ముండనము చేయించెను. కాషాయవస్త్రములు ధరింపజేసెను. "బుద్ధం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అను మూడు శరణములను చదివించెను. పిదప గురువర్యునివద్దకు తీసికొనిపోయెను. భగవానుడు సుభద్రుని శిష్యునిగా స్వీకరించి ధ్యానముచేయుట కొక విషయము నుపదేశించెను. తథాగతుడు తన యవసానమునకు ముందొనర్చిన ప్రశంసనీయ కార్య మిదియే.

ఆ రాత్రి చాలవరకు గడిచినది. బుద్ధదేవు డానందుని పిలిచి "ఆనందా! ఇక మీకు గురూపదేశము లభింపదు. ఇక గురువులేడని మీలో కొందరికి అధైర్యము కలుగ వచ్చును. కాని, మీరెంతమాత్ర మధైర్యమును పొంద కూడదు. నేను సంస్థాపించిన సత్యము, మతము నిమిత్తమై

యేర్పరచిన సూత్రములు—నా మరణానంతరము మీకు గురువులై యుండునుగాక! ఆనందా, నేను గతించినపిదప, నే నేర్పరచిన ధర్మములలో స్వల్పముగా మార్పులు కావలసినయెడల అట్టిమార్పులను చేసికొనవచ్చును" అని పలికెను.

పిదప భగవానుడు బౌద్ధభిక్షువులతో నిట్లు పలికెను. "సోదరులారా! బుద్ధునిగూర్చిగాని, సత్యమునుగూర్చిగాని, ధర్మమునుగూర్చిగాని, ఎవ్వరి మనస్సులలోనైనను సందేహములుగాని, దురభిప్రాయములుగాని ఉండవచ్చును. వానిని మీ మనస్సులలో మాత్రి ముంచుకొని బాధపడక నిరాటంకముగా ప్రశ్నింపుడు. ఇప్పుడు, నా జీవితసమయములో నడిగి తెలిసికొనకపోయినచో, నా మరణానంతరము విచారింపవలసివచ్చును. అట్టి పరిస్థితి కెడమీయక మీ సందేహముల నిప్పుడే తీర్చుకొనుడు."

బుద్ధభగవాను డిట్లు పలికినను భిక్షువు లెవ్వరును ఉలుకక పలుకక మౌనముతోనే యుండిరి. సందేహముల నడిగి, వానిని నివారించుకొనవలసినదని బుద్ధ భగవానుడు మరి రెండుసారులు హెచ్చరించినను సమాధానము రాలేదు. ఎవ్వరు నేమియు బలుకరైరి. అంత సిద్ధార్థుడు "సోదరులారా! గురునియందు మీకపారమైన భక్తి కలదు. ఆ కారణమున సందేహముల నడుగుటకె మీరు జంకుచుండ

వచ్చును. పోనీ, నన్నడుగవద్దు. మీలో మీరే చెప్పికొనుడు'' అనెను. అప్పుడును వారు నోరుతెరచి యడుగరైరి. అట్టియెడ ఆనందుడు కొంత ధైర్యము వహించి భగవానుని కంజలి ఘటించి ''దేవా! బుద్ధుని విషయమునగాని, సత్యమునగాని, ధర్మమార్గ విషయమునగాని యీ భిక్షుసంఘములో ఎవ్వరి మనస్సులలోను సందేహముగాని, వేరైన అభిప్రాయముగాని లేదు. ఇది నేను నిశ్చయముగా నెరుగుదును. ఇది సత్యమని ముమ్మాటికిని చెప్పుచున్నాను.'' అని పలికెను.

తథాగతుడు ''ఆనందా! నీవు సంపూర్ణ విశ్వాసముతో పలికితివి. నాకు తృప్తికలిగినది'' అని పలికి తక్కిన శిష్యులనుచూచి ''సోదరులారా! ద్వంద్వ పదార్థములన్నియు నశించుట స్వభావము. మీ మోక్షముంగూర్చి మీరే సాధనలు జరుపుకొనుడు.'' అనెను.

బుద్ధదేవుని కడపటివాక్యములివియే! పిదప నా మహామహుడు గాఢమైన ధ్యాననిష్ఠలో మునిగెను. అతడు క్రమక్రమముగా నైహిక సంబంధమగు జ్ఞానాదులను విడిచిపెట్టి మానసమును నిర్వికల్పసమాధియందు చేర్చెను. దానింగాంచి ఆనందుడు అనిరుద్ధునితో ''బుద్ధభగవానుడు సిద్ధిని పొందె''నని చెప్పెను. ''భగవానుడు సుఖదుఃఖములకును,

ఆలోచనలకును అతీతమైన నిర్వికల్ప సమాధిలో ప్రవేశించి నాడు'' అని అనిరుద్ధుడు పలికెను.

అనంతరము బుద్ధదేవు డా స్థితిలోనే కొంతసేపుండి దేహమును త్యజించెను.

రాజాధిరాజు పుత్రుడైన సర్వార్థసిద్ధుడు వనములోనే జనించి, చివరకు వనములోనే శరీరమును త్యజించి మహా పరినిర్వాణమును పొందెను.

బుద్ధభగవానుని మహాపరినిర్వాణానంతరము భగవానుని యస్థులను అతని శిష్యులలో నొక్కడైన ద్రోణ బ్రాహ్మణుడు ఎనిమిదిభాగములు చేసి ఒకభాగము బింబిసారుని కుమారుడగు అజాతశత్రు మహారాజునకు ఇచ్చెను. అతడు రాజగృహములో నా యస్థులపై గొప్పస్తూపము గట్టించెను. ద్రోణుడు రెండవభాగమును వైశాలియందలి లిచ్ఛవిరాజులకును, మూడవభాగమును కపిలవస్తువునందలి శాక్యులకును, నాల్గవభాగమును బులియులను తెగవారికిని, ఐదవభాగమును కోలియులను తెగవారికిని, ఆరవభాగమును వేకద్వీపములోని బ్రాహ్మణులకును, ఏడవభాగమును పావానగరములోని మల్లజాతివారికిని, ఎనిమిదవభాగమును కుసీనరములోని మల్లజాతికిని పంచియిచ్చెను. ద్రోణుడు అస్థులుంచిన భాండమును తీసికొనెను. అస్థులు లభించనివారు

చితిభస్మమును, బొగ్గులను గైకొని వెళ్లి, వానిపై తమ తమ ప్రాంతములలో స్తూపములు నిర్మించిరి.

“ప్రియ యువతిం బ్రభుత్వమును
వీడి యరణ్యముజేరె దత్త్వని
శ్చయమునకై, మహాతపము
సల్పి కృతార్థత గాంచె, నెల్లెడన్
దయయు నహింసయుం బరమ
ధర్మములన్ నెలకొల్పె, నమ్మహా
దయుడగు బుద్ధదేవుని
దంబులకేను నమస్కరించెదన్.”

(శ్రీ వేటూరి ప్రభాకరులు